ఖురాన్ తఫ్సీర్లు
క్రమం తప్పకుండా
ఫిఖ హదీసులు




ఇస్లాం అంటే ఏమిటి నుండి అంతిం సంస్కారం వరకు 117 నిధుల గురించి సంక్షిప్త, ఆధారాలతో కూడిన సమూహం
ప్రతి ఒక్కరి దృష్టిలో, వివిధ ఆలోచనా విధానం గల్గిన ఉలమా (స్కాలర్స్), మషాయఖ్, ముస్లిం సముదాయ ప్రముఖులతో స్వీకరింపబడిన గొప్ప ఇస్లామీ దీపిక

# ఇస్లాం అంటే ?

# What is Islam ?

History | Ijma | Ref | Ahwal | Aqual

Tafseer | Quran | Tawatur | Fiqua | Hadith

## ముస్లింలకు ధృఢమయిన సమైక్యతా సందేశం

సమైక్యతే జీవితం! విచ్ఛిన్నమే మరణం !


By

**Moulana Ghulam Nabi Shah**

Khateeb Masjid-e-Sunnipura,
Secunderabad.



Publisher

**Shah Educational Society**

H.No. 17-2-1209/13, Yautpura, Hyd.
Ph. : 9391349104

# యావత్తు ముస్లిం సముదాయం మౌలిక విశ్వాసాలు ఒక్కటే

## ఒక అప్పీలు

అస్సలాము అలైకుమ్
ముస్లిం సోదరులారా?

ఇస్లాం ప్రభవించినప్పటి నుంచి నేటి వరకు ఇస్లాం మౌలిక విశ్వాసాల విషయంలో ఇస్లాం తత్తవేత్తల మధ్య ఎలాంటి భేదాభిప్రాయాలు లేవు. సౌదీకి చెందిన ఒక ప్రముఖ పండితుడు కూడా తన పుస్తకం ముక్తసర్ సీరత్ రసూల్ సల్లల్లాహు అలైహి వసల్లమ్‌లో ఇస్లాం మౌలిక విశ్వాసాల గురించిన ముఖ్య విషయాలను చక్కగా వివరించారు. వాటిని ఇక్కడ రిఫరెన్సులతో సహా ఇస్తున్నాము. అల్‌హందు లిల్లాహ్ ఆ పుస్తకం సౌదీ పాఠ్య ప్రణాళికల్లో చోటు చేసు కుంది. సోదరు లారా మన మధ్య ఉన్న విభేదాలు నిజానికి ఇస్లాం శత్రువులు సాగిస్తున్న విష ప్రచారాల ఫలితాలు మాత్రమే. మన మధ్య ఉన్న వైమనస్యాలను తొలగించడం ప్రతి ముస్లిం కర్తవ్యం. ఇస్లాం తత్వవేత్తలు ఏకాభిప్రాయంతో అంగీకరించిన మౌలికవిశ్వాసాల గురించి అందరికి తెలియ పరచడం మా ఉద్దేశ్యం. మేము ముస్లిం సోదర సోదరీ మణు లందరికీ చేస్తున్న అప్పీలు ఒక్కటే విభేదాలను మరిచి ఒక్కటి అవ్వండి.

లారా మన మధ్య ఉన్న విభేదాలు నిజానికి ఇస్లాం శత్రువులు సాగిస్తున్న విష ప్రచారాల ఫలితాలు మాత్రమే. మన మధ్య ఉన్న వైమనస్యాలను తొలగించడం ప్రతి ముస్లిం కర్తవ్యం. ఇస్లాం తత్వవేత్తలు ఏకాభిప్రాయంతో అంగీకరించిన మౌలికవిశ్వాసాల గురించి అందరికి తెలియ పరచడం మా ఉద్దేశ్యం. మేము ముస్లిం సోదర సోదరీ మణు లందరికీ చేస్తున్న అప్పీలు ఒక్కటే విభేదాలను మరిచి ఒక్కటి అవ్వండి.

## సమైక్యతా సందేశం

ఈ సమైక్యతా సందేశాన్ని ప్రతి భాషలోను ప్రచురించి ప్రతి చోట ప్రచారం చేయాలి.

**సమైక్యతే జీవితం. విచ్ఛిన్నం మరణం.**

దుఆ చేయండి -**గులామ్ నబీ షా**

మౌలానా సయ్యద్ యం.యం. హుసైని, సజ్జాద నషీన్. గుల్బర్గ.
మౌలానా ముఫ్తీ ఖలీల్ అహ్మద్,షైఖుల్ జామె నిజామియ
మౌలానా ముహమ్మద్ హామీదుద్దీన్ ఆఖిల్, సెక్రటరీ మిల్లి కౌన్సిల్ హింద్

జామిఅ అజ్‌హర్, దారుల్ ఉలూమ్ దేవ్‌బంద్, జామిఅ ముజాహిరుల్ ఉలూమ్ సహరాన్‌పూర్,
జామిఅ నిజామియా, సౌదీ ఉలమాలందరూ ధార్మిక

## మౌలిక విశ్వాసాల విషయంలో ఏకాభిప్రాయం కలిగి ఉన్నారు.

### ప్రవక్తల పరంపర ముగింపు

నేను చివరి ప్రవక్తను నా తర్వాత మరో ప్రవక్త ఎవరూ రావడం జరగదు. (అహ్మద్)

### ప్రవక్త ముహమ్మద్ (స) అవతరణ

అన్ని కాలాల్లోని ఉత్తమ మానవ సంతతి నుంచి నన్ను పుట్టించడం జరిగింది (బుఖారి)

### మానవాళిలో అత్యున్నత స్థానం

నేను మానవాళికి నాయకుడిని (తిర్మిజి)

### ప్రవక్త (స) సమాధి సందర్శనం

ప్రవక్త (స) సమాధి సందర్శనం వల్ల స్వాస్థత లభిస్తుంది
(తిబ్రాని, షఫా, ఫజాయలె హజ్, పేజి 59)

**రిఫరెన్సులు :** ముక్తసర్ సీరత్ రసూల్ సల్లల్లాహు అలైహి వసల్లమ్, పేజి 11 నుంచి 16, ఈజిప్టు ప్రచురణ, సౌదీ అరేబియా పాఠ్యప్రణాళికలో పుస్తకం, అల్ ఇమామ్ బద్రుల్ అల్లామ్ షేక్ అబ్దుల్లా ఇబ్నే షేక్ ముహమ్మద్ ఇబ్నే షేక్ అబ్దుల్ వహ్హాబ్ రహ్మతుల్లా అలైహ్ రచన

### వసీలా

ఒక అంధులైన ప్రవక్త సహచరులు ప్రవక్త గారి వసీలాతో దుఆ చేయగా దేవుడు ఆయనకు చూపు ప్రసాదించాడు.
(తిర్మిజి, ఫజాయిలె హజ్, పేజి 137)

### ప్రవక్త (స) సందర్శనం

ఎవరైనా వ్యక్తి ప్రవక్త (స)ను కలలో చూస్తే ఆ వ్యక్తి ఆయన్నుచూసాడని ఖచ్చితంగా భావించాలి. ఎందుకంటే షైతాన్ ఎన్నటికి ప్రవక్త (స) రూపంలో రాలేడు. (బుఖారి, ముస్లిమ్, తిర్మిజి, తర్జుమానుస్సున్నహ్, వాల్యుమ్ 2, పేజి 1109)

### సమాధిలో సందర్శనం

ప్రతి సమాధిలోను ఉన్న వ్యక్తితో ప్రవక్త (స) గురించి ప్రశ్నించడం జరుగుతుంది.
(బుఖారి, కితాబుల్ ఇల్మ్, ఫజాయిలె సదఖాత్, పేజి 254)

### దరూద్ సలామ్

తన ఎదుట నా (ప్రవక్త (స) ప్రస్తావన వచ్చినప్పటికీ నా కోసం దరూద్ పఠించని వ్యక్తి కన్నా పిసినారి మరెవ్వరూ ఉండరు.

### ప్రవక్త (స) చిహ్నాలు

ప్రవక్త చిహ్నాలను గౌరవించడం అన్నది ప్రవక్త సహచరుల నుంచి రుజువయ్యింది. ఈ విషయంలో ముస్లిం సముదాయం ఏకాభిప్రాయాన్ని కలిగి ఉంది. అయితే ఆ చిహ్నాలు ప్రవక్త (స)కు సంబంధించినవై ఉండాలి. (బుఖారి, ముస్లిమ్, తిర్మిజి)

### ప్రవక్త (స) ఔన్నత్యం

ప్రవక్త (స) సమాధిలో ఆయన పవిత్ర శరీరాన్ని తాకిన రేణువులు యావత్తు విశ్వం కన్నా ఉత్కృష్టమైనవి. (కుత్బాత్ బర్తానియా, మదనీ మియాం ముదజల్లా, ఫజాయిలె మదీన, పేజిలు 148, 108, తబ్లీగ్ నిసాబ్)

### ప్రవక్త (స) జీవితం

జీవితం పుట్టకకు ముందు, జీవిత వయసు 63 సంవత్సరాలు, లోకజీవితం తర్వాత కూడా జీవితం సత్యమైనది.

### ప్రవక్త (స) పట్ల ప్రేమ

ఇదే అసలు విశ్వాసం
(కితాబుల్ ఈమాన్, బుఖారి, 13)

### ప్రవక్త (స) పట్ల గుస్తాఖి

ప్రవక్త (స) పట్ల గుస్తాఖి చెసినచో మరణ శిక్ష విధించాలి. బుఖారి

మౌలానా మహ్మూదుల్హసన్, అమీర్ జమాతె ఇస్లామి హింద్
మౌలానా రిద్వానుల్లాస్మి నాజిం దారుల్ ఉలూం సబీలుస్సలాం
మౌలానా సఫి అహ్మద్ మదని అమీర్ జమాత్ అహ్లె హదీస్
మౌలానా డా॥ యస్. అఖ్తర్ అజీజ్ హెడ్ తబ్లీగి జమాత్

**విభేదాలు నిర్మాణాత్మకంగా ఉండాలి. విచ్ఛిన్నానికి దారితీయరాదు.**

**జాగ్రత్త**

# ఇస్లాం అంటే?

## ముస్లిం ఎలా ఉంటాడు?

ఏకదైవారాధనను, ప్రవక్తల పరంపరను మనస్ఫూర్తిగా విశ్వసించేవాడు, దేవుని హక్కులను అంటే. **నమాజ్, రోజా (ఉప వాసం), జకాత్ (ఆర్థిక దానం), హజ్** లను నిర్వర్తించేవాడు. మానవుల హక్కు లను నిర్వర్తించేవాడు.

### మానవులు హక్కులు

తల్లిదండ్రుల పట్ల మంచి వ్యవహారశైలి. బంధువులు, పొరుగువారి హక్కులు నిర్వర్తించేవాడు బీదలు, వ్యాధిగ్రస్తులు, ప్రయాణీకుల సహాయం చేసేవాడు.

### నిషేధిత వ్యవహారాలు

నిషిద్ధాలకు దూరంగా ఉండేవాడు వాగ్దానాన్ని పాలించేవాడు. అబద్ధాలు, దొంగతనం, చాడీలు, ప్రదర్శనాబుద్ధి లేని వాడు, మోసం చేయనివాడు తోటి వారి తో  కోట్లాటలు కూడనివని భావించే వాడు,  మత విచక్షణ లేకుండా అందరికీ సేవలు అందించే వాడు, జంతువులను కూడా అనవసరంగా వేధించ కూడదని భావించేవాడు.రహదారిపై ముళ్ళు తదితర ఇబ్బందికర వస్తువులను తొల గించేవాడు.

### జీహాద్

మంచిని పెంచడం, చెడును తుంచడం అందుగ్గాను మాటలతో, రాతలతో చేతలతో ప్రయత్నించడం.

## విశ్వాసం అంటే ఏమిటి?

**విశ్వాస వచనం :** లాయిలాహ ఇల్లల్లాహ్ ముహమ్మదుర్రసూలు ల్లాహ్

**అనువాదం :** అల్లాహ్ తప్ప మరోఆరాధ్యు డెవరూ లేరు. ప్రవక్త ముహమ్మద్ (స) దేవుని ప్రవక్త ధృవీకరించడం, విశ్వాస వచనాన్ని నోటితో ఉచ్ఛరించి ధృవీక రించడం, మనస్సు లో సత్యమైనదిగా నమ్మడాన్నే ధార్మికంగా  విశ్వసించడం అంటారు.

### ముస్లిములుగా మారే పద్ధతి

ఎవరైనా ముస్లిమేతరుడు తన ఇష్ట పూర్వ కంగా ముస్లింగా మారాలను కుంటే వెంటనే  బహుదైవారాధన, విగ్రహారాధన, అవిశ్వాస భావనల నుంచి తౌబా చేసు కోవాలి. ఆ తర్వాత పవిత్ర వచనాన్ని పఠించి మనస్సులో విశ్వసించాలి. అంతే ఆ వ్యక్తి ముస్లింగా మారినట్లే. అప్పుడే తల్లి గర్భం నుంచి జన్మించిన మాదిరిగా   స్వచ్ఛ మైన వ్యక్తి  అవుతాడు.

### ఈమాన్ ముజమ్మిల్

ఆమంతుబిల్లాహి, కమా హువ బి అస్మా ఇహీ, వ సిఫాతిహీ, వ ఖబిల్తు జమీఅ అహ్ కామిహీ వ అర్కానిహి

నేను దేవుని విశ్వసిస్తున్నాను. దేవుని వివిధ పేర్లు, ఆయన గుణగణాలు అన్నింటిని విశ్వసిస్తున్నాను. దేవుని ఆదేశాలు, నియమాలు అన్నింటిని స్వీక రిస్తున్నాను.

### ఈమాన్ ముఫస్సిల్

ఆమంతు బిల్లాహి, వ మలాయికతిహీ, వ కుతుబిహీ, వ రుసులుహీ, వల్‌యవ్‌మిల్ ఆఖిరి, వ ఖద్‌రి ఖైరిహీ, వ షర్రిహీ మిన ల్లాహి తాలా వల్ బాసి బాదల్ మవ్‌త్

నేను దేవుని విశ్వసిస్తున్నాను. ఆయన దూత లను, ఆయన గ్రంథాలను, ఆయన ప్రవక్తలను, ప్రళయదినాన్ని, దేవుని తరఫున సంభవించే మంచి చెడు విధిని, మరణా నంతర జీవితాన్ని విశ్వసిస్తున్నాను.

## ఇస్లాం అంటే ఏమిటి?

ఇస్లాం ఆకాశధర్మం.

ఇస్లాం సర్వ మానవాళి కొరకు అవతరించింది

ఇస్లాంలోమానవ జీవన రంగా లన్నింటికి మార్గదర్శకత్వం ఉంది.

ఇస్లాం సత్యధర్మం. మునుపు అవతరించిన  ఆకాశ ధర్మాల స్థానంలో వాటిని రద్దుచేసి వచ్చిన ధర్మం.

### ఇస్లాం ఔన్నత్యం

ఇస్లాం శాంతి న్యాయాల ధర్మం
ఇస్లాం తల్లిదండ్రుల పట్ల మంచి వ్యవహారశైలిని బోధిస్తుంది.
ఇస్లాం తోటి మానవుల పట్ల బాధ్యతలను,
దైవం పట్ల బాధ్యతలను నిర్వర్తించాలని బోధిస్తుంది.న
ఇస్లాం భార్యాభర్తలు ఆనందంగా గడిపే పద్ధతులు బోధిస్తుంది.
ఇస్లాం పొరుగువారి పట్ల మంచివ్యవహారశైలిని బోధిస్తుంది.
ఇస్లాం వ్యాధిగ్రస్తులను పరామర్శించాలని బోధిస్తుంది

### ఇస్లాం ఆదేశాలు

ఇస్లాం ఆదేశాలు యావత్తు భూ మండలానికి సంబంధించినవి.
ఇస్లాం ఆదేశాలు ప్రళయం వరకు ఉండేవి
ఇస్లాం ఆదేశాలు యావత్తు మానవాళికి ఒకేవిధమైనవి
ఇస్లాం సరళమైన ఆచరణాయోగ్యమైన ధర్మం

### ప్రవక్తల పరంపర ముగింపు

హజ్రత్ ఆదమ్ (స) నుంచి హజ్రత్ ఈసా (అ) వరకు లక్షా ఇరవైనాలుగు వేల మంది ప్రవక్తలు అవతరించారు.
ప్రవక్త ముహమ్మద్ (స) చివరి ప్రవక్తగా యావత్తు మానవాళి హితబోధ కొరకు పంపించడం జరిగింది.
ఇక ప్రళయం వరకు మరో ప్రవక్త ఎవరూ రారు. ఒకవేళ ఎవరైనా ప్రవక్తగా ప్రకటిస్తే ఆ వ్యక్తి అబద్ధాలు చెబుతున్నాడు, మోసగాడు, మరణశిక్షకు యోగ్యుడు.

# ముసల్మాన్, విశ్వాసి ఎలా ఉంటాడు?

**ఈమాన్ - విశ్వాసం :** పవిత్ర వచనాన్ని నోటితో పఠించి, మనస్పూర్తిగా విశ్వసించడం
(కితాబుల్ ఈమాన్, బుఖారీ షరీఫ్)

**ప్రేమ :** దేవుడిని, ప్రవక్త (స) పట్ల తన ప్రేమను ఆచరణాత్మకంగా చూపేవాడు
బకర 208

**దేవుని హక్కులు :** దేవుని ఆదేశాలను (ఆరాధనలు, నమాజ్, రోజా, జకాత్, హజ్ వగైరా) నిర్వర్తించేవాడు
(ముజమ్మిల్ 20)

**మానవుల హక్కులు :** తల్లిదండ్రులు, జీవితభాగస్వామి, సంతానం, బంధువులు, పొరుగువారు, ఇతర మానవుల హక్కులను నిర్వర్తించేవారు
(అన్నిసా 36)

**మాటలు చేతలు :** తన మాటలు చేతల్లో ఒకేమాదిరిగా, అంతర్గతంగా, బాహ్యంగా ఒకేరీతిన ఉండేవారు
(అన్నిసా 35)

**ధర్మసమ్మతమైన సంపాదన :** ధర్మసమ్మతంగా సంపాదించి తినాలని నమ్మేవారు ఇతరులను ఆ విధంగా ప్రోత్సహించేవారు
(జారియాత్ 58)

**దైవ ప్రసన్నత :** తన జీవితాన్ని దేవుడిచ్చిన అమానతుగా భావించి దేవుని ప్రసన్నత కొరకే జీవించేవాడు
(అల్ బఖర 139)

**సహనం :** ప్రతి పరిస్థితిలోను సహనం వహించేవాడు, దేవుని పట్ల కృతజ& త కలిగి ఉండేవారు. అంటే దేవుడిచ్చిన సౌభాగ్యాల పట్ల కృతజ& త చూపిస్తాడు, కష్టాల్లో సహనం వహిస్తాడు.
(అహ్జాబ్ 35)

**దైవ విశ్వాసం :** తన ప్రయత్నాన్ని పూర్తిగా చేస్తూ దేవుని కారుణ్యంపై నమ్మకం ఉంచేవారు
(అన్కబూత్ 59)

**ప్రచారం :** ప్రజల్లో మంచి మాటలను మాటల ద్వారా, రాతల ద్వారా ప్రచారం చేసేవారు. చెడును నిరోధించేవారు.
(హజ్ 41)

**వాగ్దానం :** వాగ్దానాలను నిలబెట్టుకుంటారు. మాటపై నిలబడతారు.
(మోమినూన్ 8)

**ప్రళయం :** సమాధి శిక్ష, హషర్, శిక్షాబహుమానాలపై విశ్వాసం ఉంచి పరలోక జీవితం కోసం కృషి చేస్తారు.
(బకర 177)

**ప్రవక్తల పరంపర ముగింపు :** ప్రవక్త ముహమ్మద్ (స)ను చివరి ప్రవక్తగా విశ్వసిస్తారు.
( అహ్జాబ్ 4 )

**సహాయం :** దౌర్జన్యపరుల దౌర్జన్యాలను అంతం చేయడానికి పయత్నిస్తారు, బలహీనులను పూర్తిగా ఆదుకుంటారు.
(దుఆయె ఖునూత్)

**జిహాద్ :** దైవమార్గంలో మాటల ద్వారా, రాతల ద్వారా సంపద ద్వారా చేతల ద్వారా కృషి చేస్తారు. ( అహ్జాబ్ 78 )

# తహారత్, వుజు, గుసుల్ నియమాలు

### టాయిలెట్‌లోకి వెళ్ళే ముందు పఠించవలసిన దుఆ

అల్లాహుమ్మ ఇన్నీ అవూజుబిక మినల్ కుబుసి వల్ ఖబాహిస్. (బుఖారి, ముస్లిమ్)

టాయిలెట్‌లోకి ఎడమకాలు ముందు పెట్టి ప్రవేశించాలి. తన ఎడమవైపు ఎక్కువ భారం వేసి కూర్చోవాలి. కాబాకుఅభిముఖంగా కూర్చోరాదు. అలాగే కాబాకు పూర్తిగా వెనుకతిరిగి కూర్చోరాదు.

### పరిశుభ్రం చేసుకునే పద్ధతి

మూడు లేదా ఐదు మట్టిపెళ్ళలు తీసుకుని ముందు తుడుచుకోవాలి. తర్వాత నీటితో శుభ్రంగా కడుక్కోవాలి. ఆ తర్వాత రెండు చేతులు సబ్బుతో కాని మట్టితో కాని శుభ్రం చేసుకోవాలి.

### తలపై కప్పుకోవడం

టాయిలెట్‌లోకి ప్రవేశించేటప్పుడు తలపై టోపితో కప్పుకోవాలి. కాళ్ళకు చెప్పులు ధరించాలి.

### టాయిలెట్ నుంచి బయటకు వచ్చేటప్పుడు పఠించవలసిన దుఆ

టాయిలెట్ నుంచి కుడికాలు ముందు బయట పెట్టి రావాలి. క్రింది దుఆ పఠించాలి.

అల్‌హందులిల్లాహిల్లజీ అజ్‌హబ అనిల్ వ ఆఫానీ (నిసాయి, ఇబ్నె మాజా)

మినహాయించదగ్గ అపరిశుభ్రత పరిమాణం: ఘనరూపంలో ఉన్న అపరిశుభ్రత అంటే మలం లేదా రక్తం ఐదు గ్రాముల పరిమాణం వరకు ద్రవ రూపంలో ఉన్న అపరిశుభ్రత అంటే మూత్రం, ఆల్కాహాలు వగైరా రూపాయి నాణెం పరిమాణంలో ఉంటే లేదా అరచేతి గుంట అంత పరిమాణం వరకు మినహాయింపు ఉంటుంది.

### హలాల్ జంతువుల మూత్రం

హలాల్ జంతువు మూత్రం దుస్తులపై లేదా శరీర అంగాలపై పావు భాగం వరకు మినహాయింపు ఉంటుంది.

(గమనిక: పావుభాగం అనగా శరీరపు అంగ భాగాలు, దుస్తుల చివరి కొనల పావు భాగం వరకు ) అంటే అర్థం ఇలాంట అపరిశుభ్రతతో ఒకరు ప్రార్థన చేసినా ఆ ప్రార్థన సక్రమమైనదే కాని వాంఛనీయమైనది కాదు. (నిసాబ్ అహ్లె ఖిద్‌మాత్)

**వుజు నియమాలు నీరు:** వుజు లేక గుసుల్‌కు వాడే నీరు రంగు,రుచి, వాసన లేని స్వచ్ఛమైనది కావాలి.

**సంకల్పం :** అతవజ్జు లి రఫాయిల్ హదస్

### వుజులో ఫరజులు4 ఫరజులున్నాయి

1. మొత్తం ముఖాన్ని ఒకసారి కడగడం.
2. రెండు చేతులను మోచేతుల వరకు కడగడం
3. రెండు కాళ్ళను మడమల వరకు కడగడం
4. తలపై తడి చేతులతో తడమడం.

## వుజులో సున్నత్ ఆచరణలు

మొత్తం పదమూడు సున్నత్ ఆచరణలున్నాయి.

1. సంకల్పం చేసుకోవడం
2. బిస్మిల్లా పఠించడం
3. దంతాలను మిస్వాక్‌తో శుభ్రం చేసుకోవడం
4. ప్రతి అవయవాన్ని మూడుసార్లు నీటితో కడగడం.
5. చేతులను మణికట్టులవరకు కడగడం
6. నోటిని పుక్కిలించడం
7. ముక్కులోనికి నీటిని తీసుకుని శుభ్రం చేయడం
8. తడి వేళ్ళతో గెడ్డాన్ని దువ్వడం
9. తడి వేళ్ళను కాలి వేళ్ళలో పోనిచ్చి శుభ్రం చేయడం
10. తడి చేతులను తలపై రాయడం
11. చెవుల చుట్టు తడిచేతులతో శుభ్రం చేయడం
12. ఆపకుండా ఇవన్నీ చేయడం
13. ఇదంతా వరుసగా చేయడం

### ముస్తహబాత్, మక్రూహాత్

వుజులో అభిలషించదగ్గ ఆచరణలు (ముస్తహబాత్) తొమ్మిది ఉన్నాయి. పది మక్రూహాత్ అంటే అవాంఛనీయమైన ఆచరణలు ఉన్నాయి.

-చూడండి రహ్బరె నమాజ్

### వుజును భంగపరిచే అంశాలు

1. శరీరం నుంచి రక్తం లేదా చీము వెలువడడం
2. ఆపాన వాయువు
3. మలమూత్రాల విసర్జన
4. నోటి నిండా వాంతి రావడం
5. మలమూత్ర ద్వారాల నుంచి ఏదైనా వెలువడడం
6. నిద్రపోవడం, పూర్తిగా పండుకుని కాని లేక (ఏదైనా సపోర్టుకు ఆనుకుని కునుకు తీయడం కాని)
7. స్పృహ కోల్పోవడం
8. ఉన్మాదం (Madnes)
9. నమాజులో పెద్దగా నవ్వడం (ఒక వయోజనుడి నమాజె జనాజా మిన హాయింపు)

### వుజు, గుజుల్, తయమ్ముమ్‌ల తర్వాత చదవవలసిన దుఆ

అల్లాహుమ్మజ్‌అల్‌నీ మినత్తవ్వాబీన వజ్‌అల్‌నీ మినల్ ముతతహ్హిరీన.

తయమ్ముమ్ అన్నది గుసుల్, వుజులకు ప్రత్యామ్నయం

# స్త్రీల పరిశుభ్రతకు సంబంధించిన నియమాలు

## స్త్రీల పరిశుభ్రతకు సంబంధించిన నియమాలు

**రుతుస్రావం,** పురిటి స్రావాలకు సంబంధించిన నియమాలు

1. ప్రతి నెల గర్భాశయం నుంచి వెలువడే రక్తం రుతుస్రావం
2. రుతుస్రావ దినాలు మూడు పగళ్ళు మూడు రాత్రులు గరిష్టంగా పది పగళ్ళు పది రాత్రులు
3. రుతుస్రావం నిర్దిష్టంగా లేని స్త్రీ రుతుస్రావ దినాలు పదిగా భావించాలి.
4. రుతుస్రావం వచ్చే కనిష్ఠ వయసు తొమ్మిది సంవత్సరాలు. గరిష్ట వయసు యాభై ఐదు సంవత్సరాలు
5. ఒకవేళ తొమ్మిది సంవత్సరాల కన్నా తక్కువ వయసులో లేక యాభై ఐదు సంవత్సరాల కన్నా ఎక్కువ వయసులో స్రావం కనబడితే అది రుతుస్రావం కాదు, వ్యాధి వల్ల వచ్చిన రక్తంగా భావించాలి.
6. కొందరు స్త్రీలలో యాభైఐదు సంవత్సరాల తర్వాత కూడా రుతుస్రావం కనబడవచ్చు.
7. బాలిక రుతుస్రావమైతే లేదా రుతుస్రావం అవ్వక పోయినా గర్భం దాల్చితే లేదా గర్భం దాల్చకపోయినా తన భర్తతో సంభోగించినట్లు కలలో అనుభూతి పొందితే ఈ మూడు సందర్భాల్లోను ఆ బాలిక పెద్దమనిషి అయ్యిందనే భావించాలి. ఈ మూడు విషయాలు లేకపోయినా ఒకవేళ బాలిక వయసు పదిహేను సంవత్సరాలైతే పెద్ద మనిషిగానే గుర్తించాలి.
8. మూడు రోజుల కన్నా తక్కువ లేదా పదిరోజుల కన్నా ఎక్కువ రక్తస్రావం కనబడితే అది రుతుస్రావం కాదు, వ్యాధి వల్ల వచ్చే నెత్తురుగా భావించ బడుతుంది. ఈ పరిస్థితిలో నమాజు, భర్తతో సంభోగం రెండు సమ్మతమే.
9. రుతుస్రావం కాని, పురిటి స్రావం కాని గర్భాశయం నుంచి స్రవిస్తాయి. వ్యాధివల్ల వచ్చే రక్తస్రావం రక్త నాళాలు చిట్లడం వల్ల రావచ్చు.
10. శిశువు జన్మించిన తర్వాత గర్భాశయం నుంచి వచ్చే రక్తం పురిటిస్రావం
11. పురిటిస్రావానికి గరిష్ట పరిమితి 40 రోజులు కనిష్ట పరిమితి లేదు.
12. గర్భవతిగా ఉన్నప్పుడు రక్తస్రావమైతే అది కూడా వ్యాధిగానే పరిగణించాలి.
13. పురిటి తర్వాత నలభై రోజులకు మించి రక్త స్రావముంటే అది కూడా వ్యాధిగానే పరి గణించాలి.
14. గర్భస్రావమైతే, శిశువు అవయవాలు ఏవీ రూపొందక కేవలం మాంసం ముద్దగా ఉన్నప్పటికీ పురిటిస్రావంగానే పరిగణించాలి.
15. దివ్యఖురాన్‌ను ఖురాను పీఠంపై ఉండగా తాకడం సమ్మతమే.
16. దివ్యఖుర్ఆన్‌ను చూసి ఖుర్ఆన్ పాఠాలు చెప్పడం కూడా సమ్మతమే
17. రుతుస్రావ కాలంలో నమాజు పూర్తిగా మాఫీ అవుతుంది. అయితే ఉపవాసాలు మాత్రం ఖజా చేయాలి.
18. రుతుస్రావ కాలంలో సంభోగం నిషిద్ధం. నాభి నుంచి మోకాళ్ళ వరకు వస్త్రాలు లేకుండా స్త్రీ శరీరాన్ని చూడడం, లేదా తడమడం మక్రూ తహ్రీమీ అవుతుంది. అయితే మిగిలిన శరీర భాగాన్ని తాకడం సమ్మతమే
19. రుతుస్రావ కాలంలో భార్యతో ఒకే పడకపై పడుకోవడం, ఆమె వండిన వంటకాలు అన్నీ సమ్మతమే.
20. రుతుస్రావం ఏ రంగులో ఉన్న రుతుస్రావమే. స్రావం తెల్లగా అయితే రుతుస్రావం ముగిసినట్లే.
21. రుతుస్రావం లేదా పురిటిస్రావం ముగిసిన వెంటనే గుసుల్ చేసి నమాజులు ప్రారంభించాలి. కొందరు పురిటిస్రావం ముగిసిన తర్వాత కూడా నలభైరోజుల వరకు ఆగి ఉంటారు. ఇది అజ్ఞానమే.
22. పదిరోజుల వరకు రుతుస్రావం ఉండే స్త్రీ రుతు స్రావ కాలం ముగిసిన వెంటనే గుసుల్ చేయక పోయినా భర్తతో సంభోగం సమ్మతమే.
23. అయితే పది రోజుల కన్నా తక్కువ రుతుస్రావం ఉండే స్త్రీ రుతుస్రావం ముగిసిన తర్వాత గుసుల్ చేయకుండా భర్తతో సంభోగం చేయరాదు. అయితే కనీసం ఒక నమాజు సమయం గడిచిన తర్వాత గుసుల్ చేయకపోయినా భర్తతో సంభోగం సమ్మతమే.
24. స్త్రీ రెండు రుతుస్రావాలకు మధ్య కనీసం పదిహేను రోజులు పరిశుభ్రంగా ఉంటుంది. గరిష్ఠ దినాలకు పరిమితి లేదు.
25. కొందరు స్త్రీలకు జీవితాంతం రుతుస్రావం రాకపోవచ్చు.

అల్లాహుమ్మా ఇన్నీ అవూజుబిక మినల్ హబ్‌సి వల్ ఖబాయిసి అని పఠించి ఎడమ కాలు ముందు పెట్టి టాయిలెట్‌లోకి ప్రవేశించాలి. ఎడమవైపు భారం వేసి ఖిబ్లావైపు ముఖం కాని, వీపు కాని లేకుండా కూర్చోవాలి. మలమూత్రాల విసర్జనప్పుడు మర్మావయవాలను చూడరాదు. ఎడమచేతితో శుభ్రం చేసుకోవాలి. బయటకు వచ్చేటప్పుడు కుడికాలు ముందు పెట్టి రావాలి. వచ్చేటప్పుడు క్రింది దుఆ పఠించాలి. అల్‌హందు లిల్లాహిల్లజీ అజ్‌హబ అనిల్ అజా వ ఆఫానీ. టాయిలెట్‌లోకి వెళ్లేటప్పుడు చెప్పులు ధరించి, తలపై వస్త్రం కప్పుకుని వెళ్ళాలి.

## మినహాయించదగ్గ అపరిశుభ్రత పరిమాణం

ఘనరూపంలో ఉన్న అపరిశుభ్రత అంటే మలం లేదా రక్తం ఐదు గ్రాముల పరిమాణం వరకు ద్రవరూపంలో ఉన్న అపరిశుభ్రత అంటే మూత్రం, ఆల్కాహాలు వగైరా రూపాయి నాణెం పరిమాణంలో ఉంటే లేదా అరచేతి గుంట అంత పరిమాణం వరకు మినహాయింపు ఉంటుంది.

## హలాల్ జంతువుల మూత్రం

హలాల్ జంతువు మూత్రం దుస్తులపై లేదా శరీరంపై పావు భాగం వరకు మినహాయింపు ఉంటుంది. అంటే అర్థం ఇలాంటి అపరిశుభ్రతతో ఒకరు ప్రార్థన చేసినా ఆ ప్రార్థన సక్రమమైనదే కాని వాంఛనీయమైనదికాదు.

(నిసాబ్ అహ్లె ఖిద్‌మాత్)

పాలు తాగే పిల్లవాని మూత్రం వాంతి కూడా అపరిశుభ్రతగానే పరిగణించాలి

ఎండిన వీర్యం, రుతుస్రావం, పురిటిస్రావం, మలం వగైరాలను దుస్తులపై గట్టిగా రుద్దితే చాలు, మరక ఉన్నప్పటికీ శుభ్రపడతాయి ద్రవరూపంలో ఉన్న వీర్యం, రుతుస్రావాలను నీటితో కడిగితే వస్త్రాలు శుభ్రపడతాయి.

**వుజు నియమాలు** నీరు: వుజు లేక గుసుల్‌కు వాడే నీరు రంగురుచి వాసన లేని స్వచ్ఛమైనది కావాలి.

సంకల్పం : అతవజ్జు లి రఫాయిల్ హదస్

వుజులో ఫరజులు నాలుగు ఫరజులున్నాయి 1. మొత్తం ముఖాన్ని ఒకసారి కడగడం. 2. రెండు చేతులను మోచేతుల వరకు కడగడం 3. రెండు కాళ్ళను మడవల వరకు కడగడం 4. తలపై తడి చేతులతో తడమడం.

**తయమ్ముమ్** సంకల్పం : అతయమమ్ముల్ రిఫాఅల్ హద్స్

సంకల్పం చేసుకున్న తర్వాత రెండు చేతులను పరిశుభ్రమైన మట్టి లేదా గోడపై అద్ది ముఖమంతా రుద్దుకోవాలి. రెండోసారి మట్టిపై లేదా గోడపై చేతులు అద్ది రెండు చేతులు మోచేతుల వరకు రుద్దుకోవాలి. వుజు భంగపడే అంశాల వల్ల తయమ్ముమ్ కూడా భంగపడుతుంది. వ్యాధి సంబంధిత కారణం లేదా మరే ఇతర షరీఅత్ పరమైన కారణం లేకుండా తయమ్ముమ్ చేసినా అది సమ్మతం కాదు. వుజు, గుసుల్‌లకు ప్రత్యామ్నయం తయమ్ముమ్. గుసుల్‌కు బదులు చేసుకున్న తయమ్ముమ్ మళ్ళీ గుసుల్ వాజిబ్ అయ్యే వరకు ఉంటుంది. గుసుల్ ఫరజ్ కావడానికి ఐదు కారణాలున్నాయి.

1. కోరిక వల్ల వీర్యస్ఖలనం కావడం 2. స్వప్నంలో స్ఖలనం కావడం 3. వతీ 4. రుతుస్రావం ఆగిపోవడం 5. పురిటిస్రావం ఆగడం

వతీ అంటే పురుషాంగం శీర్షభాగం స్త్రీ మర్మావయవంలో ప్రవేశించడం. శీర్షభాగం ప్రవేశించినా ఇద్దరిపై గుసుల్ ఫరజ్ అవుతుంది.

గుసుల్ రకాలు, రుతుస్రావం, పురిటిస్రావం, సంభోగం, వతీ

మృతదేహానికి గుసుల్ ఇవ్వడం ఫర్జ్ కిఫాయా అవుతుంది. గుసుల్ ఇచ్చేవారు కూడా గుసుల్ చేయాలి. ఈదుల్ ఫిత్ర్, ఈదుజ్జుహా, లైలతుల్ బరాత్, లైలతుల్ ఖద్ర్, కొత్త దుస్తులు ధరించేటప్పుడు, హజ్ ఉమ్రాలకు ఇహ్రామ్ ధరించేటప్పుడు, ప్రవక్త (స) సమాధి సందర్శించేటప్పుడు గుసుల్ చేయడం మస్నూన్

**గుసుల్ పద్ధతి** నవైతు అన్‌ఇగ్తిసాల మిన్ గుసులి హైజ (ఉదాహరణకు)ఇమ్‌తె సాలన్ లి అమ్రిల్లాహి తాలా తహారతన్ లిల్‌బదని లిఇస్తిబాహతిస్సలాతి వరఫాఇల్ హదస్ సంకల్పం చేసుకున్న తర్వాత రెండు చేతులు కడగాలి. ముందు వెనుక ఉన్న అవయవాలు కడగాలి. శరీరం నుంచి అపరిశుభ్రాన్ని దూరం చేయాలి. పుక్కిలించాలి. ముక్కులో నీరు తీసుకుని శుభ్రం చేయాలి. పూర్తి శరీరంపై వెంట్రుకవాసి కూడా పొడిగా ఉండకుండా తడపాలి.

వుజు గుసుల్ తయమ్ముమ్‌ల తర్వాతి దుఆ అల్లాహుమ్మ అజ్‌అల్‌నీ మినత్తవ్వాబీన మినల్ ముతతహ్హిరీన అనువాదం : అల్లాహ్ నన్ను తౌబా చేసే వారిలో, పరిశుభ్రమైన వారిలో ఒకడిగా చేయ్.. ఆమీన్

# నమాజులో ఫరజులు, వాజిబులు, నమాజును భంగపరిచే అంశాలు

## నమాజు ఫరజులు 14

1. శరీరం శుభ్రంగా ఉండడం
2. దుస్తులు శుభ్రంగా ఉండడం
3. దుస్తులు శరీరంపై తగినంత పరిమాణంలో (సతర్) ఉండడం
4. స్థలం పరిశుభ్రంగా ఉండడం
5. నమాజు వేళకు చేయడం
6. ఖిబ్లాకు అభిముఖంగా ఉండడం
7. సంకల్పం చేసుకోవడం

## నమాజులోమౌలికాంశాలు

1. తక్బీరె తహ్రీమా పలుకడం
2. ఖియామ్ అంటే నమాజులో నిల బడడం
3. ఖుర్ఆన్ పారాయణం చేయడం
4. రుకు చేయడం
5. సజ్దా చేయడం
6. ఖాయెదా అంటే నమాజు చివర కూర్చోవడం.
7. నమాజును పూర్తిచేయడం 14 నమాజు ఫరజుల్లో ఏ ఒక్కటి తప్పినా లేదా మరిచిపోయినా నమాజు పూర్తి కాదు. మళ్ళీ నమాజు చదువ వలసి ఉంటుంది.

## పురుషులకు సతర్

నాభి (బొడ్డు) నుంచి మోకాళ్ళ క్రింది వరకు వస్త్రం కప్పి ఉండడం సతర్

## స్త్రీలకు సతర్

స్త్రీలు పూర్తి శరీరాన్ని తలవెంట్రుకలు కూడా కనబడకుండా కప్పుకోవాలి. ముఖం, అరిచేతులు, పాదాలు ఆచ్ఛాదన లేకుండా వదలవచ్చు. శరీరం కనబడే మాదిరి పలుచని వస్త్రం ధరించి నమాజు చేస్తే స్త్రీలకైనా, పురుష లకైనా నమాజు కాదు.

## నమాజులో వాజిబులు 14

1. ఫాతిహా సూరా చదువడం
2. రెండవ సూరా చదువడం
3. ఖురాను క్రమపద్ధతిలో చదువడం
4. నమాజులో అంశాలను క్రమ పద్ధతిలో నెరవేర్చడం
5. మొదటి ఖాయెదా చేయడం
6. అత్తహియ్యాత్ చదువడం
7. బిగ్గరగా చదువవలసిన ఖిరాత్‌ను పాటించడం
8. నెమ్మదిగా చదువవలసిన ఖిరాత్‌ను పాటించడం
9. నమాజు చివర సలామ్
10. దుఆయే కునూత్
11. ఈద్ నమాజుల్లో తక్బీరులు
12. విత్ర్ మూడో రకాతులో తక్బీర్ పలుకడం
13. ఖౌమా చేయడం
14. జల్సా చేయడం (జల్సా అంటే రెండు సజ్దాల మధ్య మూడు సార్లు సుబ్‌హానల్లా అన్నంత సేపు కూర్చోవడం)

**ఖౌమా అంటే రుకు నుంచి లేచి తిన్నగా నిలబడడం.**

## సజ్దా సహూ

వాజిబ్ వదిలేసినప్పుడు,వాజిబ్‌ను రెండు సార్లు మరిచిపోయి చేసినప్పుడు,

వాజిబ్ ఆలస్యంగా చేసినప్పుడు,

వాజిబ్ క్రమపద్ధతిలో కాకుండా చేసి నప్పుడు,

## సజ్దా సహూ పద్ధతి

చివరి ఖాయిదాలో తషహద్దుద్ చదివిన తర్వాత కుడివైపు సలామ్ చెప్పి మళ్ళీ అల్లాహు అక్బర్ అంటూ రెండు సజ్దాలు చేయాలి. తర్వాత మళ్ళీ తషమద్దుద్, దరూద్, దుఆ చదివి రెండువైపులా సలామ్ చేయాలి.

## నమాజును భంగపరిచే అంశాలు

నమాజును భంగపరిచే అంశాలను ముఫ్సిదాతె నమాజ్ అంటారు

1. నమాజు చేస్తున్నప్పుడు మాట్లాడడం (మరుపు వల్ల కాని, తక్కువ కాని ఎక్కువ కాని)
2. ఎవరికైనా జవాబీయడం, సలామ్ చేయడం, సలామ్‌కు జవాబియ్యడం
3. ఎవరైనా తుమ్మితే అలవాటుగా యర్‌హముకల్లాహ్ అనడం
4. మంచి వార్త విని అల్‌హందులిల్లాహ్ అనడం
5. చెడువార్త విని ఇన్నల్లాహ్ వ ఇన్న అలైహి రాజివూన్ పలకడం
6. ఆశ్చర్యకరమైన వార్త విని సుభానల్లా, లేదా లాయిలాహ ఇల్లల్లాహ్ అనడం
7. ఏదైనా బాధ వల్ల గట్టిగా రోదించడం
8. స్వర్గం, నరకం గురించిన ప్రస్తావల కారణంగా రోదించడం వల్ల నమాజు భంగం కాదు.
9. ఎలాంటి కారణం లేకుండా గొంతు సవరించుకోవడం
10. ఏదైనా కారణంతో అలా చేస్తే నమాజు భంగం కాదు.
11. ఏదైనా ఐహికపరమైన దుఆ చేయడం అంటే నాకు సంపద ఇవ్వు, ఆస్తిఇవ్వు అంటూ దుఆ చేయడం
12. దివ్యఖుర్ఆన్ చూసి చదువడం. అయితే ఎవరైనా రాసిన ఖుర్ఆన్ ప్రతిపై దృష్టిపడినా, అది అర్థమైనా, నోటితో ఉచ్ఛరించకపోతే నమాజు భంగం కాదు.
13. దివ్యఖుర్ఆన్‌ను తప్పుగాచదువడం, అంటే అర్థం మారిపోయేలా చదువడం
14. నమాజు జరుగుతున్నప్పుడు లుక్మా ఇవ్వడం, తీసుకోవడం, అయితే లుక్మా ఇచ్చేవారు ముక్తదీ అయి, తీసుకునే వారు ఇమామ్ అయితే అది సమ్మతమే
15. నమాజు చేస్తున్నప్పుడు నమాజు చేయని వ్యక్తి మాట ప్రకారం చేయడం కూడా నమాజును భంగం చేస్తుంది.
16. నమాజులో తినడం, తాగడం వల్ల నమాజు భంగం అవుతుంది.
17. నమాజులో బిగ్గరగా నవ్వడం (దీని వల్ల నమాజు మాత్రమే కాదు వుజూ కూడా భంగం అవుతుంది.)
18. జనాజా నమాజుకు మాత్రం ఈ విషయంలో మినహాయింపు ఉంది.
19. నమాజులో స్త్రీపురుషుడితో సమానంగా నిలబడడం.
20. అశుభ్రమైన స్థలంలో సజ్దా చేయడం
21. నమాజు ఫరజుల్లో, మౌలిక అంశాల్లో ఏదైనా పూర్తి చేయక పోవడం

ఇఖామత్
కూర్చుని వినడం
సున్నత్

# ఇఖామత్ నియమాలు

హయ్యాఅలల్ ఫలా అన్నప్పుడు లేచి నిలబడాలి

ఇఖామత్
నిలబడి వినడం
మక్రూ

## ఇఖామత్‌కు ఇచ్చే జవాబు

ఖద్‌ఖామతిస్సలాహ్ విన్నప్పుడు అఖాముహల్లాహు వ అదమహా అనాలి.

నమాజు స్థాపించబడింది.. అల్లాహ్ ఎల్లప్పుడు నమాజును స్థాపితమై ఉండేలా చేయాలి.. ఆమీన్

## షరతులు

1. అజాన్ అరబీలో, అవే పదాలతో ఉండాలి.
2. ముఅజ్జిన్ పురుషుడై ఉండాలి.
3. ముఅజ్జిన్ మానసికంగా సరయిన వ్యక్తి కావాలి.
4. యుక్తవయస్కుడై ఉండడం షరతు కాదు. వివేచన. ఉన్న బాలుడు కూడా అజాన్ ఇవ్వవచ్చు.
5. ఏ నమాజు కొరకు అజాన్ ఇస్తున్నారో ఆ నమాజు వేళయి ఉండాలి.

## అజాన్ నియమాలు

1. అజాన్ వినే స్త్రీ పురుషులు అజాన్‌కు జవాబీయడం వాజిబ్
2. దివ్యఖుర్ఆన్ పారాయణం చేస్తుంటే అజాన్ వినేటప్పుడు ఆపేయాలి
3. జుమా నమాజు మొదటి అజాన్ విని పనులన్నీ ఆపేసి మస్జిదుకు వెళ్లాలి. ఆ సమయంలో క్రయవిక్రయాలు లేదా ఇతర పనుల్లో మునిగి ఉండడం హరామ్

## భంగపరిచే అంశాలు

రాగయుక్తంగా చేయడానికి అనవసరంగా అక్షరాలను సాగదీయడం, అల్లాహ్‌లో అ అక్షరాన్ని సాగదీయడం వగైరాలు ముహమ్మద్ అన్న పదంలో చివర ముహమ్మదు అంటూ చదువడం

## అజాన్‌కు జవాబివ్వకూడదు.

1. నమాజు స్థితిలో ఉన్నప్పుడు
2. కుత్బా వింటున్నప్పుడు
3. ధర్మవిద్య నేర్పుతున్నప్పుడు
4. భార్యతో కలిసి ఉన్నప్పుడు
5. మలమూత్ర విసర్జన చేస్తున్నప్పుడు
6. రుతుస్రావం, పురిటిస్రావాల స్థితిలో ఉన్నప్పుడు

## శిశు జననం

బాలుడు జన్మించినా, బాలిక జన్మించినా అల్లాహ్ కారుణ్యంగా భావించాలి.అల్లాహ్ కి కృతజ్ఞత చెల్లించాలి. అల్లాహ్ శరణ : అల్లాహుమ్మ ఇన్నీ యు ఇజుహా వ జుర్రియాతిహా మినష్షైతానిర్రజీమ్ (ఆలె ఇమ్రాన్ 36)

అనువాదం : ఓ దైవమా నేను ఆమెను ఆమె సంతానాన్ని షైతాన్ బారి నుంచి నీ శరణులో ఇస్తున్నాను. శిశువు జన్మించిన వెంటనే స్నానం చేయించి, శుభ్రమైన వస్త్రంలో చుట్టి, ధర్మాత్ముడైన పెద్దమనిషితో కుడి చెవిలో అజాన్, ఎడమ చెవిలో ఇఖామత్ చెప్పించాలి. ఆ తర్వాత ఖర్జూరాన్ని ఆ పెద్దమనిషి బాగా నమిలి, తేనెతో కలిపి శిశువుకు రుచి చూపించాలి. దాన్ని నుదుటికి రాయాలి. (మిష్కాత్)

## రిఫరెన్సులు


మిష్కాతె మసాబిహ్ పేజి 63, 67, బుకారి, ముస్లిం షరీఫ్
మజాహిర్ హక్ జదీద్ పేజి 10, 34,
ఫతావా ఆలంగీరి, వాల్యూం 1, పేజి 3
మాలా బుదమ్‌ను పేజి 38
ముతా షరీఫ్ పేజి 6 - 88
ఫికా యే హనఫియా దుర్రె ముక్తార్, ఫతావా షామి, వాల్యూం 1, పేజి 268
హాషియా మిరాకుల్ ఫలాహ్, పేజి 151,
కితాబె ముజమ్మిరాత్ షారా వికాయ, వాల్యూం 1, పేజి 155
అక్వాల్ ఇమామె ఆజమ్, ఇమామ్ అబూ యూసుఫ్, ఇమామ్ ముహమ్మద్
అష్అతుల్ లామత్ వాల్యూం 1 పేజి 321

# పురుషుల నమాజ్

## నమాజును సున్నత్ పద్ధతిలో చదవాలి

**కియాం :** కాబాకు అభిముఖంగా నిలబడాలి. ఖియాం ఫరజు. కియాంలో రెండు పాదాల మధ్య నాలుగంగుళాల స్థలం ఉండాలి. దృష్టి సజ్దా చేసే స్థలంపై ఉండాలి. తక్బీరె తహ్రీమా చెబుతూ రెండు చేతులను చెవుల వరకు పైకెత్తాలి. వేళ్లు తెరిచి ఉండాలి. అరిచేయి ఖిబ్లావైపు ఉండాలి. రెండు చేతులను పైకెత్తి చెవికమ్మెలను బొటనవేలితో తాకి తర్వాత చేతులు దించి నాభిక్రింద చేతులు కట్టుకోవాలి. ఎడమ చేతి మణికట్టును కుడిచేతి బొటనవేలు, చిటికెనవేలితో పట్టుకోవాలి. మూడు వేళ్లు తిన్నగా ఎడమచేతిమణికట్టుపై ఉండాలి. వరుసలు తిన్నగా ఉండడానికి పక్క వారి కాలిమడమల ప్రకారం అదే వరుసలో నుల్చోవాలి. రెండు కాళ్ళు తిన్నగా ఉండాలి. కాలివేళ్ళు తిన్నగా ఖిబ్లావైపు ఉండాలి. సనా, తఅవ్వుజ్, తస్మియా, సూరా ఫాతిహా, రెండవ సూరా చదివిన తర్వాత తక్బీర్ పలుకుతూ రుకులోకి వెళ్ళాలి. .

**రుకు :** రుకు నమాజులో ఫరజ్. రుకులో దృష్టి కాలిపాదల మధ్య స్థలాన్ని చూడాలి. రెండు మోకాళ్ళను రెండు అరిచేతులతో, వేళ్ళను పూర్తిగా విప్పి పట్టుకోవాలి. నడుం, వీపు, మెడ, తల ఒకేఎత్తులో తిన్నగా ఉండాలి. కాలి మడమలు తిన్నగా ఉండాలి. ఆ తర్వాత తస్మియా పలుకుతూ ఖౌమా కోసం తిన్నగా నిలబడాలి.తర్వాత తమ్‌హీద్ పలకాలి. ఖౌమా వాజిబ్. తస్మిహ్.. సమీ అల్లాహులిమన్ హామీద, తమ్‌హీద్.. రబ్బనా లకల్ హమ్ద్. .



**సజ్దా :** సజ్దా ఫరజ్. సజ్దా చేయడంలో ముందు మోకాళ్ళు, తర్వాత చేతులు, తర్వాత ముక్కు తర్వాత నుదురు నేలకు ఆన్చాలి. దృష్టి ముక్కుపై ఉండాలి. అరిచేతులు చెవులకు దగ్గరగా ఉండాలి. చేతివేళ్ళు కలిసి ఉండాలి. మోచేతులు చంకలకు, నేలకు దూరంగా ఉండాలి. మోచేతులు నేలకు ఆన్చడం మక్రూ. కాలి వేళ్ళు, చేతి వేళ్ళు ఖిబ్లా వైపు ఉండాలి. సజ్దా స్థితిలో కాలి బొటనవేలు పైకెత్తరాదు. సజ్దా స్థితిలో రెండు కాళ్ళ బొటనవేళ్ళు నేలపై లేచితే నమాజు మక్రూ అవుతుంది. సజ్దా నుంచి లేస్తున్నప్పుడు ముందు నుదురు, తర్వాత ముక్కు, తర్వాత చేతులు, తర్వాత మోకాళ్ళు పైకిలేపాలి. రెండు సజ్దాల మధ్య కనీసం మూడు సార్లు సుబ్‌హానల్లాహ్ పలికేంత సమయం కూర్చోవడం వాజిబ్. దీనిని జల్సా అంటారు. జల్సాలో కూర్చున్నప్పుడు రెండు అరిచేతులు మోకాళ్ళకు దగ్గరగా తొడలపై ఉండాలి. .



**ఖాయెదా :** మొదటి ఖాయెదా వాజిబ్. రెండవ ఖాయెదా ఫరజ్. ఖాయెదాలో కూర్చున్నప్పుడు ఎడమపాదం పరిచి, కుడిపాదం బొటనవేలికి ఆన్చి దానిపై కూర్చోవాలి. చేతులు మోకాళ్ళకు దగ్గరగా, వేళ్ళు కలిసి ఖిబ్లావైపు ఉండేలా ఉంచాలి. దృష్టి ఒడిలో ఉండాలి. కలిమా షహదత్ పలుకుతూ బొటనవేలు, మధ్యవేలు కలపాలి, లాయిలాహ పలుకుతున్నప్పుడు చూపుడువేలు పైకి లేపాలి. ఇల్లల్లాహ్ అంటున్నప్పుడు చూపుడు వేలు కిందికి దించాలి. నమాజు పూర్తయ్యే వరకు బొటనవేలు, మధ్యవేలు కలిపే ఉంచాలి. దరూద్ ఇబ్రాహీమ్, దుఆ అయిన తర్వాత నమాజును సంకల్పంతో పూర్తి చేయడం ఫరజ్. అందువల్ల ముందు కుడివైపు, తర్వాత ఎడమవైపు సలామ్ చెప్పాలి. అస్సలాము అలైకుమ్ వ రహ్మతుల్లాహి అనడం వాజిబ్



**దుఆ :** దుఆలో రెండు చేతులు ఛాతీ వరకు ఎత్తి ఖిబ్లావైపు దోసిలి చాచి ఉంచాలి. రెండు చేతుల మధ్య దాదాపు నాలుగంగుళాల దూరం ఉండాలి. అరిచేతులు ఆకాశంవైపు ఉండాలి. వేళ్ళు కొద్దిగా తెరిచి ఉండాలి. దృష్టి చేతులపై ఉండాలి. దుఆ రోదిస్తూ మొరపెట్టుకునేదై ఉండాలి. దు:ఖం రాకపోతే కనీసం ముఖంలో దు:ఖం కనబడేలా ఉండాలి. దుఆకు ముందు దుఆ చివరిలో దేవుని స్తుతించాలి. దరూద్ సలామ్ తప్పక పఠించాలి. దుఆ తర్వాత రెండు చేతులు ముఖంపై తడమాలి .



రిఫరెన్సు : ఖానూన్ షరిఅత్, నిసాబ్ అహ్లె ఖిద్‌మాత్, ఫతావీ రజ్వియా వగైరా) నమాజు అనేక శారీరక వ్యాయామాల సంకలనం వంటిది. ఇది శారీరక ఆరోగ్యానికి, ఆధ్యాత్మిక ప్రశాంతతకు ఎంతయినా అవసరం. అనేక మంది ప్రముఖ ధర్మవేత్తలు, వివిధ ధార్మిక పథాల ఉలమాలు ప్రశంసించిన ఈ చార్టును ఇంటింటికి చేర వేయండి.

# స్త్రీల నమాజ్

## నమాజును సున్నత్ పద్ధతిలో చదవాలి

**కియాం :** కాబాకు అభిముఖంగా నిలబడాలి. ఖియాం ఫరజు. కియాంలో రెండు పాదాల మధ్య నాలుగంగుళాల స్థలం ఉండాలి. దృష్టి సజ్దా చేసే స్థలంపై ఉండాలి. తక్బీరె తహ్రీమా చెబుతూ రెండు చేతులను భుజాల వరకు ఎత్తాలి. వేళ్లు తెరిచి తిన్నగా పైకి ఉండాలి. అరిచేయి ఖిబ్లావైపు ఉండాలి. రెండు చేతులను పైకెత్తి తర్వాత చేతులు దించి ఓణీ క్రింద ఛాతీపై కట్టుకోవాలి. ఎడమ చేతి మణికట్టుపై కుడి అరచేయి ఉండేలా కట్టుకోవాలి. దృష్టి సజ్దా స్థలంపై ఉండాలి. సనా, తఅవ్వుజ్, తస్మియా, సూరా ఫాతిహా, రెండవ సూరా చదివిన తర్వాత తక్బీర్ పలుకుతూ రుకులోకి వెళ్ళాలి.

**రుకు :** రుకు నమాజులో ఫరజ్. రుకులో దృష్టి కాలిపాదల మధ్య స్థలాన్ని చూడాలి. రెండు మోకాళ్ళ వరకు రెండు అరిచేతుల వేళ్ళను తీసుకెళ్ళాలి. మోకాళ్ళను పట్టుకోనవసరం లేదు. నడుం, వీపు, మెడ, తల ఒకేఎత్తులో ఉండేలా వంగాలి. ఆ తర్వాత తస్మియా పలుకుతూ ఖౌమా కోసం తిన్నగా నిలబడాలి.తర్వాత తమ్హీద్ పలకాలి. ఖౌమా వాజిబ్. తస్మీహ్.. సమీ అల్లాహులిమన్ హమీద, తమ్హీద్.. రబ్బనా లకల్ హమ్ద్..

**సజ్దా :** సజ్దా ఫరజ్. సజ్దా చేయడానికి తక్బీర్ పలుకుతూ నేలపై కూర్చోవాలి. తర్వాత రెండు కాళ్ళ పాదాలను కుడివైపునకు వచ్చేలా పరచాలి. తర్వాత చేతులు, తర్వాత ముక్కు, తర్వాత నుదురు నేలకు ఆన్చాలి. దృష్టి ముక్కుపై ఉండాలి. అరిచేతులు చెవులకు దగ్గరగా ఉండాలి. చేతివేళ్ళు కలిసి ఉండాలి. సజ్దా నుంచి లేస్తున్నప్పుడు ముందు నుదురు, తర్వాత ముక్కు, తర్వాత చేతులు లేపి పూర్తిగా కూర్చోవాలి. తర్వాత రెండవ సజ్దా చేయాలి. రెండు సజ్దాల మధ్య కనీసం మూడు సార్లు సుబ్‌హానల్లాహ్ పలికేంత సమయం కూర్చోవడం వాజిబ్. దీనిని జల్సా అంటారు.

**ఖాయెదా :** మొదటి ఖాయెదా వాజిబ్. రెండవ ఖాయెదా ఫరజ్. ఖాయెదాలో కూర్చున్నప్పుడు రెండుపాదాలు కుడివైపు నేలపై పరిచి కూర్చోవాలి. దృష్టి ఒడిలో ఉండాలి. చేతులు మోకాళ్ళకు దగ్గరగా వేళ్ళు కలిపి, ఖిబ్లావైపు తిన్నగా ఉంచాలి. కలిమా షహదత్ పలుకుతూ బొటనవేలు, మధ్యవేలు కలపాలి, లాయిలాహ పలుకుతున్నప్పుడు చూపుడువేలు పైకి లేపాలి. ఇల్లల్లాహ్ అంటున్నప్పుడు చూపుడు వేలు కిందికి దించాలి. నమాజు పూర్తయ్యే వరకు బొటనవేలు, మధ్యవేలు కలిపే ఉంచాలి. దరూద్ ఇబ్రాహీమ్, దుఆ అయిన తర్వాత నమాజును సంకల్పంతో పూర్తి చేయడం ఫరజ్. అందువల్ల ముందు కుడివైపు, తర్వాత ఎడమవైపు సలామ్ చెప్పాలి. అస్సలాము అలైకుమ్ వ రహ్మతుల్లాహి అనడం వాజిబ్

**దుఆ :** దుఆ ఆరాధనల సారం వంటిది. దుఆలో రెండు చేతులు ఛాతీ వరకు ఎత్తి ఖిబ్లావైపు దోసిలి చాచి ఉంచాలి. రెండు చేతుల మధ్య దాదాపు నాలుగంగుళాల దూరం ఉండాలి. అరిచేతులు ఆకాశంవైపు ఉండాలి. వేళ్ళు కొద్దిగా తెరిచి ఉండాలి. దృష్టి చేతులపై ఉండాలి. దుఆ రోదిస్తూ మొరపెట్టుకునేదై ఉండాలి. దు:ఖం రాకపోతే కనీసం ముఖంలో దు:ఖం కనబడేలా ఉండాలి. దుఆకు ముందు దుఆ చివరిలో దేవుని స్తుతించాలి. దరూద్ సలామ్ తప్పక పఠించాలి. దుఆ తర్వాత రెండు చేతులు ముఖంపై తడమాలి.

**రిఫరెన్సు :** ఖానూన్ షరిఅత్, నిసాబ్ అహ్లె ఖిద్‌మాత్, ఫతావీ రజ్వియా వగైరా)

నమాజు అనేక శారీరక వ్యాయామాల సంకలనం వంటిది. ఇది శారీరక ఆరోగ్యానికి, ఆధ్యాత్మిక ప్రశాంతతకు ఎంతయినా అవసరం.

అనేక మంది ప్రముఖ ధర్మవేత్తలు, వివిధ ధార్మిక పథాల ఉలమాలు ప్రశంసించిన ఈ చార్టును ఇంటింటికి చేరవేయండి.



# రోజువారి మస్నూన్ దుఆలు

**నిద్ర నుంచి లేచిన వెంటనే పఠించవలసిన దుఆ**

అల్‌హందులిల్లాహిల్లజీ అహ్‌యానా బాద మా అమాతనా వ ఇలైహిన్నుషూర్ (బుఖారి, ముస్లిం)

**పడుకునే ముందు పఠించవలసిన దుఆ**

అల్లాహుమ్మ బిస్మిక అమూతు వ అహ్‌యా (బుఖారి, ముస్లిం)

**టాయిలెట్‌లోకి ప్రవేశించేటప్పుడు పఠించవలసిన దుఆ**
అల్లాహుమ్మ ఇన్నీ అవూజుబిక మినల్ ఖుబ్సి వల్ ఖబాయిసి (అబుదావూద్)

**టాయిలెట్ నుంచి బయటకు వచ్చేటప్పుడు పఠించవలసిన దుఆ**
అల్‌హందులిల్లాహిల్లజీ అజ్‌హబ అన్నీల్‌అజా వ ఆఫానీ (ఇబ్నె మాజా)

**వుజు చేసిన తర్వాతి దుఆ** అల్లాహుమ్మజ్‌అల్‌నీ మినత్తవ్వాబీన వజ్‌అల్‌నీ మినల్ ముతతహ్హిరీన్ (ముత్తఫిక్ అలై)

**దుస్తులు ధరించేటప్పుడు పఠించవలసిన దుఆ**
అల్‌హందు లిల్లా హిల్లజీ కసానీహాజా వ రజఖ్‌నీహి మిన్ గైరి హావ్‌లింమ్మిన్నీ వలా ఖువ్వతి (తిర్మిజి)

**భోజనం ప్రారంభించే దుఆ** బిస్మిల్లాహి వ అలా బర్కతిల్లాహి (తిర్మిజి)

**భోంచేసేటప్పుడు దుఆ** అల్లాహుమ్మలకల్ హందు వలక షుక్రుక (ముస్తద్రక్)

**భోజనం తర్వాతి దుఆ** అల్‌హందులిల్లాహిల్లజీ అత్‌అమ్‌నా వసఖానా వజఅల్‌నా మినల్ ముస్లిమీన్ (తిర్మిజి)

**దావత్ తర్వాతి దుఆ**
అల్లాహుమ్మ అత్‌ఇమ్ మన్ అత్‌అమనీ వస్‌ఖీ మన్ సఖానీ (తిర్మిజి)

**ఇంటి నుంచి బయటకు వెళ్లే దుఆ** బిస్మిల్లాహి తవక్కల్తు అలల్లాహిలా హౌల వలా ఖువ్వత ఇల్లా బిల్లాహ్ (తిర్మిజి)

**మస్జిదులో ప్రవేశించే దుఆ** బిస్మిల్లాహి వస్సలాము అలా రసూలిల్లాహి అల్లాహుమ్మ ఇన్నీ అస్‌అలుక మిన్ ఫజ్‌లిక వ రహ్మతిక (ముస్లిం)

**ఇంటిలో ప్రవేశించే దుఆ** బిస్మిల్లాహి వలహ్‌నా వ అలల్లాహి రబ్బనా తవక్కల్‌నా (ముస్లిం)

**వాహనంపై ఎక్కే దుఆ** బిస్మిల్లాహి అల్‌హందులిల్లాహి సుబ్‌హానల్లజీ సఖ్ఖరలనా హాజా వమా కున్నా లహూ ముఖ్‌రినీన వ ఇన్నా ఇలా రబ్బనల్ మున్‌ఖలిబూన్ (అబూదావూద్)

**ఏదైనా బసకు చేరుకున్నప్పటి దుఆ** అవూజుబికలిమా తిల్లాహిత్తామాతిల్లాహిత్తామాతి మిన్ షర్రి మా ఖలఖ్ (ముస్లిం)

**కొత్త చంద్రుని చూసిన దుఆ** అల్లాహుమ్మ అహిల్లహు అలైనా బిల్ యుమ్‌ని వల్ ఐమాని వస్సలామతి వల్ ఇస్లామి రబ్బి వ రబ్బుకల్లాహ్

**కొత్తపని ప్రారంభించే దుఆ** బిస్మిల్లాహిర్రహ్‌మానిర్రహీమ్. అల్లాహుమ్మఖిర్‌లీ వఖ్‌తర్‌లీ (తిర్మిజి)

**విద్యలో ప్రగతికి దుఆ** అల్లాహుమ్మన్‌ఫఅనీ బిమా అల్లమ్‌తనీ వ అల్లిమ్‌నీ మా యన్‌ఫవూనీ వజిద్‌నీ ఇల్మన్ (తిర్మిజి)

**హలాల్ సంపాదన కోసం దుఆ** అల్లాహుమ్మక్‌ఫనీ బి హలాలిక అన్ హరామిక వఅగ్‌నినీ బి ఫజ్‌లిక అమ్మన్ సివాక (తిర్మిజి)

**మొదటి కలిమా తయ్యిబ**
లాయిలాహ ఇల్లల్లాహ్ ముహమ్మదుర్రసూలిల్లాహ్

**రెండవ కలిమా షహాదత్**
అష్‌హదుఅన్ లాయిలాహ ఇల్లల్లాహు వహదహూ లా షరీక లహూ వ అష్‌హదు అన్న ముహమ్మదన్ అబ్దహూ వ రసూలుహూ

**మూడవ కలిమా తమ్‌జీద్**
సుబ్‌హానల్లాహి వల్‌హందు లిల్లాహి వలా ఇలాహ ఇల్లల్లాహు వల్లాహు అక్బర్. వలా హవ్‌లా వలా ఖువ్వత ఇల్లాబిల్లాహిల్ అలియ్యిల్ అజీమ్

**నాలుగవ కలిమ తౌహీద్**
లాయిలాహ ఇల్లల్లాహు వహ్‌దహూ లాషరీకలహూ లహుల్ ముల్కు వలహుల్‌హందు యుహ్‌యీ వయుమీతు బియదిహిల్ ఖైరు వహువ అలా కుల్లి షైఇన్ ఖదీర్

**ఐదవ కలిమ రద్దెకుఫ్ర్**
అల్లాహుమ్మ ఇన్నీ అవూజుబిక మిన్ అన్ ఉష్‌రిక. బిక షైఅంవ్వఅనా ఆలము బిహీవస్తగ్‌ఫిరక లిమా లా ఆలము బిహితుబ్తు అన్‌హు వతబర్రాతు మినల్ కుఫ్రి వష్షిర్‌కి వల్ కిజ్బి వల్‌గీబతి వల్ బిద్అతి వన్నమీమతి వల్ ఫవాహిషి వల్ బుహ్తాని వల్మాసి కుల్లిహా వాస్లంతు వ ఆమంతు వ అఖూలు లాఇలాహ ఇల్లల్లాహు ముహమ్మదుర్రసూలుల్లాహి.

**మంచి కల చూసినప్పుడు పఠించవలసిన దుఆ**
అల్‌హందులిల్లాహి.. ఎవరైనా ధర్మాత్ముడిని కల ఫలితం అడగాలి (మిష్కాత్)

**చెడు కల చూసినప్పుడు పఠించవలసిన దుఆ**
అవూజుబిల్లాహి మినష్షైతానిర్రజీమ్ వ మిన్‌షర్రి హాజిహిర్రుయా

# మస్జిదు, కుత్బా దుఆల నియమాలు

## మస్జిదు నియమాలు

### మస్జిదు ఔన్నత్యం

- మస్జిదు భూమిపై ఉన్న స్థలాల్లో ఉత్తమమైన స్థలం
- మస్జిదు భూమిపై దేవుని పవిత్ర గృహం
- మస్జిదులో చదివే ఫరజు నమాజు ఇంటో చదివే ఫరజు నమాజు కన్నా 27 రెట్లు పుణ్యప్రదమైనది.
- మస్జిదులో దర్సెఖురాన్, హితబోధ, ధర్మోపదేశం చేసేవారికి జిహాద్ పుణ్యం లభిస్తుంది.

### మస్జిద్ సేవ

- మస్జిదుకు నమాజుకు వెళ్ళడం ఈమాన్‌కు సంకేతం, స్వర్గనికి చిహ్నం
- మస్జిదును శుభ్రం చేయడం వల్ల హృదయం పరిశుభ్రమవుతుంది. తేజోమయం అవుతుంది.
- మస్జిదులో కసవును శుభ్రం చేయడమన్నది హూర్ మహెర్ చెల్లించడమవుతుంది.
- మస్జిదులో సువాసనలు వెదజల్లేవాడు స్వర్గవాసి.
- మస్జిదులో వెలుతురుకు ఏర్పాటు చేయడం తన సమాధిని తేజోమయం చేసుకోవడం.

### మస్జిదులో ప్రవేశం

వుజుతో నమ్రత, పవిత్రభావాలతో కుడి కాలు ముందు పెట్టి మస్జిదులోప్రవేశించాలి.ఈ క్రింది దుఆ చదవాలి.

బిస్మిల్లాహి వస్సలాము అలా రసూలిల్లాహి అల్లాహుమ్మ ఇన్నీ అస్అలుక మిన్ ఫజ్‌లిక వ రహ్మతిక (ముస్లిం)

- రెండు రకాతులు తహియ్యతుల్ మస్జిదు నఫీల్ నమాజు చదవాలి.
- ఎక్కువసేపు మస్జిదులో ఉండేటట్లయితే ఎతెకాఫ్ సంకల్పం చేసుకోండి.
  ఫరజ్ నమాజ్ చదివి వాపసు అయ్యేదయితె కుడికాలు ముందు పెట్టి బయటకు రావాలి.
- క్రింది దుఆ చదవాలి బిస్మిల్లాహి వస్సలాము అలా రసూలిల్లాహి అల్లాహుమ్మా ఇన్నీ అస్అలుక మిన్ ఫజలిక వ రహ్మతిక

## కుత్బా నియమాలు

### కుత్బా నియమాలు

కుత్బా ఇచ్చే కతీబ్ మింబర్ వైపు వెళుతున్నప్పటి నుంచి జిక్ర్, తస్బీహ్, తిలావత్,సలామ్, కలామ్ అన్నీ ఆపేసి ఖాయెదాలోకూర్చుని చేతులు కట్టుకుని కుతా వినడానికి సిద్ధపడాలి.

**కుత్బా భాష**

కుత్బా అరబీ భాషలో ఉండాలి. ఇతర భాషలను కలుపడం సున్నత్‌కు వ్యతిరేకం మక్రూ తహ్రీమీ అవుతుంది. (నిసాబ్)

**వాజిబ్ :** ప్రారంభం నుంచి చివరి వరకు మొత్తం కుత్బా వినడం వాజిబ్. దూరంగా కూర్చున్నా, దగ్గరగా కూర్చున్నా, కుత్బా వినబడినా, వినబడక పోయినా కుత్బావైపే ధ్యానం ఉండాలి.

**మక్రూ తహ్రీమీ :** కుత్బా వినడాన్ని భంగపరిచ చర్య ఏదైనా గాని మక్రూ అవుతుంది.

**కుత్బా జరుగుతున్నప్పుడు**

- తినడం తాగడం, తిరగడం, మాట్లాడడం, సలామ్ చేయడం, జిక్ర్ తస్బీహ్, తిలావత్, చివరకు నఫీల్ నమాజులు కూడా సమ్మతం కాదు. ఎవరికైనా షరిఅత్ పరమైన మసలా వివరించడం కూడా సమ్మతం కాదు.
- మస్జిదులో కుత్బా మొదలైన తర్వాత వెళ్ళడం మక్రూ తహ్రీమీ

**కుత్బా.. నమాజ్** నమాజ్‌లో నిషిద్ధమైన అంశాలన్నీ కుత్బా సందర్భంగా కూడా నిషిద్ధాలే. ఒకవేళ సున్నత్ నమాజు చదువు తున్నప్పుడు కుత్బా ప్రారంభమైతే అప్పుడు నమాజును పూర్తి చేసుకోవాలి.

**కూర్చునే పద్ధతి :** ఖాయెదా స్థితిలో చేతులు కట్టుకుని కూర్చోవాలి. రెండవ కుత్బాలో చేతులు వదిలేసి తొడలపై పెట్టుకోవాలి. **గమనిక :** కుత్బా జరుగుతున్నప్పుడు ఇతరులను మాట్లాడవద్దని చెప్పడం, జిక్ర్ తస్బీహ్‌లను నివారించడం కూడా చేయరాదు, అలా చేయడం కూడా మాట్లాడడంతో సమానమవుతుంది.

**ఇతర కుత్బాలు :** జుమా కుత్బా, నికాహ్ కుత్బా తదితర కుత్బాలన్నింటిని శ్రద్ధగా వినడం వాజిబ్

**దరూద్ షరీఫ్ :** కుత్బా సందర్భంగా ప్రవక్త ముహమ్మద్ (స) పేరు ప్రస్తావనకువస్తే నిశ్శబ్ధంగా దరూద్ షరీప్ చదువుకోవాలి. ప్రవక్త (స) సహచరుల పేర్లు విని బిగ్గరగా రజీఅల్లాహు అన్హొ అనడం కూడా మక్రూయే (ఫికా హనఫియా). రెండవ కుత్బా పూర్తయ్యే వరకు నమాజుకు లేవరాదు.

జుమారోజున, ఈద్‌రోజున ఫజర్ నమాజు చదువకపోతే జుమా నమాజు, ఈద్ నమాజులు కూడా పూర్తికావు.

## దుఆ నియమాలు

### తౌబా చేసే ఉత్తమ పద్ధతి

దీనంగా ప్రార్ధించాలి. ఈ క్రింది దుఆ పఠించాలి

అల్లాహుమ్మ ఇన్నీ అస్అలుక బహక్ సయ్యదినా ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లమ్ అన్తగ్ ఫిర్‌లీ. యా అల్లా, నిస్సందేహంగా నేను నీ ప్రియ తమ ప్రవక్త ముహమ్మద్ (స) తుఫైల్‌తో క్షమా భిక్ష కోరుతున్నాను. అని ప్రార్ధించాలి.

**పూర్తి విశ్వాసంతో ప్రార్ధించాలి :** దేవుడు మనల్ని చూస్తున్నాడన్న నమ్మకంతో ప్రార్ధిం- చాలి. మన ప్రార్ధన వింటున్నాడన్న పూర్తి నమ్మకంతో ప్రార్ధించాలి. **హృదయపూర్వకంగా ప్రార్ధించాలి :** సంకల్పశుద్ధి ఉన్నప్పుడే మనస్సులో నిజాయితి ఉంటుంది. హృదయంలోంచి నిజాయితితో కూడిన ప్రార్ధన వెలువడు తుంది. ఇలాంటి దుఆ తక్షణం నెరవేరు తుంది. **పూర్తి శ్రద్ధతో దుఆ చేయాలి :** అల్లాహ్ పట్ల పూర్తి శ్రద్ధతో మనస్పూర్తిగా దుఆ చేయాలి.

**గమనిక :** విస్మరించే వారి దుఆ స్వీకరించ బడదు. (తిర్మిజి) **నఫీల్ నమాజు :** ప్రవక్త ముహమ్మద్ (స) ఏమన్నారంటే, ఎవరైతే వుజు చేసి రెండు రకాతులు నఫీల్ నమాజు చదివి దుఆ చేస్తారో వారి దుఆ తక్షణం స్వీకరించ బడు తుంది. (తిబ్రానీ)

దీనంగా ప్రార్ధించాలి. ఈ క్రింది దుఆ పఠించాలి

అల్లాహుమ్మ ఇన్నీ అస్అలుక బహక్ సయ్య దినా ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లమ్ అన్తగ్‌ఫిర్‌లీ.

యా అల్లా, నిస్సందేహంగా నేను నీ ప్రియతమ ప్రవక్త ముహమ్మద్ (స)తుఫైల్ తో క్షమాభిక్ష కోరు తున్నాను అని ప్రార్ధిం చాలి. **పూర్తి విశ్వాసం తో ప్రార్ధించాలి :** దేవుడు మనల్ని చూస్తున్నాడన్న నమ్మకంతో ప్రార్ధించాలి. మన ప్రార్ధన వింటున్నాడన్న పూరి నమ్మకం తో ప్రార్ధించాలి. **హృదయపూర్వకంగా ప్రార్ధించాలి :** సంకల్పశుద్ధి ఉన్నప్పుడే మనస్సులో నిజాయితి ఉంటుంది. హృద యంలోంచి నిజాయితితో కూడిన ప్రార్ధన వెలువడుతుంది. ఇలాంటి దుఆ తక్షణం నెరవేరుతుంది.**పూర్తి శ్రద్ధతో దుఆచేయాలి :** అల్లాహ్ పట్ల పూర్తి శ్రద్ధతో మనస్పూర్తిగా దుఆ చేయాలి. **గమనిక :** విస్మరించే వారి దుఆ స్వీకరించబడదు (తిర్మిజి)

**నఫీల్ నమాజు :** ప్రవక్త ముహమ్మద్ (స) ఏమన్నారంటే, ఎవరైతే వుజు చేసి రెండు రకాతులు నఫీల్ నమాజు చదివి దుఆ చేస్తారో వారి దుఆ తక్షణం స్వీకరించ బడుతుంది. (తిబ్రానీ)

**దుఆ చేసే పద్ధతి :** రెండు చేతులు ఛాతీ వరకు ఎత్తి చేతులు చాచాలి. వేళ్ళు కాబా దిశగా ఉండాలి. అరి చేతులు ఆకాశంవైపు ఉండాలి. రెండు చేతలు మధ్య పది సెంటీమీటర్ల దూరం ఉండాలి. చేతివేళ్ళు కొద్దిగా తెరిచి ఉండాలి. దృష్టి చేతులపై ఉండాలి. రోదిస్తూ దుఆ చేయాలి. ఏడ్పు రానట్లయితే కనీసం దు:ఖంగా ముఖాన్ని మార్చి దుఆ చేయాలి. దుఆ ప్రారంభంలో చివరిలో దేవుని స్తుతించాలి. దరూద్ సలామ్ పఠించాలి. దుఆ పూర్తయిన తర్వాత రెండు చేతులు ముఖంపై రాయాలి.

### మస్జిదులో నిషిద్ధాలు

- ఉల్లిపాయలు, లేదా వెల్లుల్లి తిని మస్జిదులో ప్రవేశించరాదు. (వీటిని తినడం వల్ల నోటిలో చెడువాసన వస్తుంది)
- ఆలస్యంగా వచ్చి ఇతర ముసల్లీలను దాటుకుంటూ వెళ్లరాదు.
- బిగ్గరగా మాట్లాడరాదు.
- తినడం తాగడం అక్కడ నిద్రపోవడం చేయరాదు (ఎతెకాఫ్‌లో సమ్మతమే)
- మస్జిదు మూసివేయడం మక్రూ (దొంగతనాలు జరిగే భయం ఉంటే సమ్మతమే)
- క్రయవిక్రయాలు చేయరాదు
- ప్రాపంచిక వ్యవహారాలు మాట్లాడరాదు
- గర్వం అతిశయం కూడవు.
- మస్జిదులో ఉమ్మివేయడం
- బిచ్చమెత్తడం చేయరాదు.

# నమాజు వల్ల లాభాలు, నమాజు చదువని వారికి నష్టాలు

దివ్యఖుర్ఆన్, హదీసుల వెలుగులో

- నమాజువల్ల పాపాలు క్షమించ బడతాయి.
- నమాజు వల్ల ఉపాధిలో వృద్ధి ఉంటుంది.
- నమాజు వల్ల ప్రతి సమస్యలో ఆధారం దొరకుతుంది.
- నమాజు వల్ల సమాధి శిక్ష ఉండదు.
- నమాజు చదివే వ్యక్తి ప్రళయదినాన పుణ్యాత్ములతో పాటు ఉంటాడు.
- నమాజు చదివే వ్యక్తికి ఆచరణల లెక్క తీసుకోవడం జరుగదు.
- నమాజు చదివే వ్యక్తి పుల్ సిరాత్‌పై మెరుపులా వెళ్ళిపోతాడు.

(అహ్మద్, నిసాయి, బుఖారి, ముస్లిం)

- నమాజు చేయని వాడికి ప్రపంచంలో నష్టాలు
- నమాజు వదిలేయడం అన్నింటిని కోల్పోవడం వంటిది.
- నమాజు చేయని వ్యక్తికి మరణ సమయం లో తీవ్రమైన ఆకలిదప్పికలు ఉంటాయి.

## నమాజు వదిలేస్తే నష్టాలు

1. నమాజు చేయనివాడి హృదయంలో దైవ విశ్వాసం పోతుంది.
2. నమాజు చేయనివాడు అవమానా లతో పరాభవాలతో మరణిస్తాడు.
3. ఫజర్ నమాజు వదిలేసిన వాడి ముఖం లో వర్ఛస్సు ఉండదు.
4. జుహర్ నమాజు వదిలేసినవాడి ఉపాధిలో సౌభాగ్యం ఉండదు.
5. అస్ర్ నమాజు వదిలేసిన వాడి శరీరం లో శక్తి ఉండదు.
6. మగ్రీబ్ నమాజువదిలేసిన వాడి సంతానం వల్ల ప్రయోజనం ఉండదు.
7. ఇషా నమాజు వదిలేసిన వాడి నిద్రలో ప్రశాంతత ఉండదు.

## సమాధి శిక్ష

- సమాధి ఇరుకుగా చీకటిగా అయి పోతుంది.
- సమాధిలో అగ్ని రాజుకుంటుంది
- సమాధిలో నిప్పులు కక్కేమహాసర్పం ఫజర్ వేళనుంచి మళ్ళీ ఫజర్ వేళ వరకు కాటు వేస్తూనే ఉంటుంది.

## ప్రళయదినాన శిక్ష

- నమాజు చేయని వారి లెక్క కఠినంగా తీసుకోవడం జరుగుతుంది.
- నమాజు చేయని వారిపై అల్లాహ్ ఆగ్రహిస్తాడు
- నమాజు చేయనివారి పరిస్థితి ఫిరౌను, ఖారూను, షద్దాద్‌ల పరిస్థితి అవుతుంది.
- నమాజు చేయనివారిని తల్లక్రిందులుగా నరకంలో పడేయడం జరుగుతుంది.

# మిస్వాక్ చేయడం

## ప్రవక్తల సంప్రదాయం

## మిస్వాక్ వల్ల డెబ్బయి ప్రయోజనాలున్నాయి.

- దంతాల కుదుళ్ళు గట్టిపడతాయి ఇబ్బె అబ్బాస్ రజి అల్లాహు అన్హు
- దంతాలు తెల్లగా మెరుస్తాయి (హకీంలు)
- నోటిలో చెడువాసన ఉండదు. (హకీంలు)
- తలనొప్పి దూరం అవుతుంది (హకీంలు)
- కడుపులో ఇబ్బందులు దూరం అవుతాయి (హకీంలు)
- నోటిలో శ్లేష్మం దూరమవుతుంది(హకీంలు)
- హృదయం పరిశుభ్రం అవుతుంది (హకీంలు)
- శరీరం ఆరోగ్యంగా ఉంటుంది. ( ఇబ్బె అబ్బాస్ రజి అల్లాహు అన్హు
- వినికిడి చూపు బాగుంటాయి. (హజ్రత్ అలీ కర్రమల్లాహ్ వజ్హహు)
- జ్ఞాపకశక్తి పెరుగుతుంది. (హకీంలు)
- నమాజు పుణ్యాలు డెబ్బయి రెట్లు పెరుగుతాయి. (తిర్మిజి)
- ప్రసంగాల్లో వాగ్ధాటి ఉంటుంది. బుహురైర రజియల్లాఅన్హు
- మిస్వాక్‌లో చాలా సౌభాగ్యం ఉంది. (అఇమ్మా)
- మిస్వాక్ చేసేవారి ముఖంలో వర్ఛస్సు ఉంటుంది.
- జుమా రోజు మిస్వాక్ చేస్తే వారం రోజుల పొరబాట్లు మన్నించ బడతాయి. (షరఅల్‌మానియల్ ఆసార్)
- మిస్వాక్ వల్ల ఉపాధి లో సౌభాగ్యం ఉంటుంది.(నిసాయి)
- మిస్వాక్ చేయడం దైవ విశ్వాసంలో భాగం (ఇబ్నెఅబి షేబ)
- మిస్వాక్ చేసేవ్యక్తితో దైవ దూతలు కరచలనం చేస్తారు.
- మిస్వాక్ చేయాలని తాకీదు చేయడం జరి గింది కాబట్టి ఇది సున్నత్(ముస్లిం షరీఫ్)
- మిస్వాక్ షైతానుకు ఆగ్రహం కలుగజేస్తుంది.
- నోటిలో పుండ్లను తగ్గిస్తుంది
- బఫం యాస్ట్రింజెంట్ గా పనిచేస్తుంది.
- మరణసమయంలో కలిమా ప్రాప్తమవుతుంది (హదీసు)
- ముస్లిం సముదాయానికి ఇబ్బందికరంగా మారుతుందన్న ఆలోచన లేకపోతే మిస్వాక్‌చేయాలని ఆదేశించ బడం జరిగేది. (బుఖారి)

## మిస్వాక్ (బ్రష్) చేసే నియమాలు

1. మిస్వాక్ చేయడానికి ముందు, చేసిన తర్వాత మిస్వాక్‌ను బాగా కడగాలి.
2. పై దంతాలను పైనుంచి క్రిందికి, క్రింది దంతాలను క్రింది నుంచి పైకి మిస్వాక్ చేయాలి.

# నడక విషయమై ప్రవక్త ముహమ్మద్ (స) బోధనలు

وَاسْتَعِيْنُوا بِالْغَدْوَةِ وَالرَّوْحَةِ وَشَيْءٍ مِنَ الدُّلْجَةِ۔ (بخاری)

**తెల్లవారుజామున, సాయంకాలం వాకింగ్, రాత్రి సమయంల వాకింగ్ ద్వారా ప్రయోజనాలు పొందండి** (బుఖారి)

**ప్రయోజనం :** వాకింగ్ వల్ల రక్తప్రసరణ మెరుగవుతుంది. ఆరోగ్యం బాగుపడుతుంది.

రిఫరెన్సులు : బుఖారి, మొదటి వాల్యుం, కితాబుల్ ఈమాన్, హదీస్ నెంబర్ 38)

**ఒక ప్రత్యేక గమనిక :** భోజనానికి ముందు లేదా భోజనం తర్వాత ఉప్పు లేదా కూర ఏదైనా రుచి చూడండి (హదీస్)

**ప్రయోజనం :** ఉప్పు లేదా కూరను రుచి చూడడం వల్ల లాలాజనం ఊరుతుంది. ఇది కడుపులోకి వెళ్ళి జీర్ణశక్తిని పెంచుతుంది.

**శుభవార్త :** ఆధునిక కాలంలో ప్రపంచం ఇస్లాం బోధనలలో సత్యాన్ని తెలుసుకుంటోంది. డాక్టర్లు, ఫిలాసఫర్లు, శాస్త్రవేత్తలు ఇస్లాం స్వీకరిస్తున్నారు.

రిఫరెన్సులు : అరబ్ న్యూజ్, సియాసత్ ఉర్దు

- యావత్తు మానవాళికి ఇస్లాం ఒక అత్యున్నతమైన వరం. ఇది సంపూర్ణమైన, సమగ్రమైన ధర్మం. ఇది ఆరంభం నుంచి ఉంది, ప్రళయం వరకు ఉంటుంది. (దివ్యఖుర్ఆన్)

- ఇస్లాం బోధనలను ఆచరణల ద్వారా ప్రచారం ద్వారా యావత్తు మానవాళికి చేరవేయడం ప్రతి ముస్లిం బాధ్యత. (మాయిదా 3, నహ్ల్ 125, అస్సఫ్ 10 వగైరా)

# తినడం, త్రాగడం, నిద్ర వగైరాలకు సంబంధించిన ఇస్లామీయ పద్ధతులు

## ప్రవక్త (స) సంప్రదాయంలో సౌభాగ్యం ఉంది. కారుణ్యం ఉంది. ఆరోగ్యం ఉంది. గౌరవం ఉంది. దైవకృప ఉంది. ఔన్నత్యం ఉంది. స్వర్గమూ ఉంది.

**భోజనం చేసే పద్ధతి :** రెండు చేతులు మోచేతులతో సహా ఒకసారి కడుక్కోవాలి. కడిగిన చేతులను తుడుచుకోరాదు. భోజనానికి కూర్చునే పద్ధతులు మూడున్నాయి.

1. కుడిపాదాన్ని నిలబెట్టి ఎడమపాదంపై కూర్చోవడం.
2. నమాజులోని ఖాయెదా భంగిమలో మాదిరిగా కూర్చోవడం.
3. ప్రయాణంలో ఉన్నప్పుడు గొంతు కూర్చునే భంగిమలో కుడి కాలి బొటనవేలు ఎడమ కాలి బొటనవేలుపై ఉండేలా కూర్చోవాలి. ఎలాంటి కారణం లేకుండా ఆనుకుని కూర్చోవడం చేయరాదు. భోజనానికి ముందు, భోజనం తర్వాత ఉప్పు లేదా కూర ఏదైనా రుచి చూడాలి.

**భోజనానికి ముందు దుఆ :** اَللّٰهُمَّ بَارِكْ لَنَا فِىْ مَا رَزَقْتَنَا وَرُزُقْنَا خَيْرً مِنْهُ بِسْمِ اللهِ وَ عَلٰى بَرْكَةِ الله

అల్లాహుమ్మ బారిక్‌లనా ఫీమా రజక్‌నా వర్‌జుక్‌నా ఖైరమిన్‌హు బిస్మిల్లాహి వ అలా బరకతిల్లాహి బుఖారి వ ముస్లిం

**భోంచేసేటప్పుడు దుఆ :** అల్లాహుమ్మ లకల్ హమ్దు లకల్ షుక్‌రక اَللّٰهُمَّ لَكَ الْحَمْدُ لَكَ الشُّكْرُكْ

బుఖారి వ ముస్లిం

**భోజనం తర్వాతి దుఆ :** اَلْحَمْدُ لِلّٰهِ الَّذِىْٓ اَطْعَمَنَا وَسَقَانَا وَجَعَلَنَا مِنَ الْمُسْلِمِيْنَ۔

అల్‌హందులిల్లాహిల్లజీ అతఅమనా వసఖానా వజఅల్‌నా మినల్‌ముస్లిమీన్ బుఖారి వ ముస్లిం

**త్రాగేపద్ధతి :** నీళ్ళను చూసి, కూర్చుని తాగాలి. కుడిచేత్తో తాగాలి. బిస్మిల్లా హిర్రహ్‌మా నిర్రహీమ్ చదువాలి. కనీసం మూడు గుక్కలుగా తాగాలి. నీళ్ళు తాగిన తర్వాత అల్‌హందులిల్లాహ్ అనాలి. నీళ్ళు తాగించిన వ్యక్తిని ఉద్దేశించి సఖా కల్లాహుఖైర అనాలి. ఒకవేళ చేతులు కడుక్కోకముందే నీళ్ళు తాగేదయితే ఎడమచేత్తో గ్లాసు పట్టుకుని కుడిచేత్తో సపోర్టు ఇచ్చి తాగాలి. వజూలో మిగిలిన నీళ్ళు, ఆబెజమ్‌జమ్ నీళ్ళు తాగేటప్పుడు నిలబడి గౌరవపూర్వకంగా కాబాకు అభిముఖంగా తాగాలి.

ఆబెజమ్‌జమ్ దుఆ :

اَللّٰهُمَّ اِنِّىْٓ اَسْئَلُكَ عِلْماً نَافِعاً وَ رِزْقاً وَّسِعاً وَشِفَاءً مِّنْ كُلِّ دَاءٍ ۔

అల్లాహుమ్మ ఇన్ని అస్‌అలుక ఇల్మన్నాఫిఅ వ రిజ్ఖన్వాసిఅ వషిఫాఅన్ మిన్కుల్లిదాఇన్



**నిద్రించే పద్ధతి :** ఇషా నమాజు తర్వాత పడక దగ్గర మిస్వాక్, నీళ్ళు, సుర్మా, లాఠీ, అద్దం, దువ్వెన, టార్చ్‌లైటు ఉంచుకుని నిద్రపోవాలి. పడకను మూడుసార్లు శుభ్రం చేసు కోవాలి. తఅవ్వుజ్, తస్మియా, మూడు ఖుల్ సూరాలు, ఆయతుల్ కుర్సీ, తస్బీహ్ ఫాతిమా చదువుకుని చేతులపై ఊది చేతులను శరీరమంతా రాసుకోవాలి.



**నిద్రించే దుఆ :** అల్లాహుమ్మ బిస్మిక అమవ్‌తు వ అహ్‌యా .. చదివి నిద్రించాలి.

నిద్రించే పద్ధతి రెండు విధాలు. اَللّٰهُمَّ بِاسْمِكَ اَمُوْتُ وَ اَحْيَا۔

1. తల ఉత్తరం దిశగా, కాళ్ళు దక్షిణం దిశగా, ముఖం కాబా వైపు ఉండేలా కుడిపక్కకు తిరిగి కుడి చేయి కుడిచెంప క్రింద ఉండేలా నిద్రించాలి. ఎడమచేయి కాలితొడపై ఉంచుకోవాలి. మోకాళ్ళు కాస్త వంచి కుడికాలి వెనుక ఎడమకాలు ఉండేలా పడుకోవాలి.



2. వెల్లకిలా తల కాబాదిశగా లేదా ఉత్తర దిశగా ఉండేలా (భారతదేశంలో) కుడిచేతి మణికట్టు నుదిటిపై ఉండేలా, ఎడమచేయి కడుపుపై ఉండేలా నిద్రించాలి. రెండు కాళ్ళు తిన్నగా ఉంచి ఎడమకాలి బొటనవేలు, మధ్యవేళ్ళ మధ్యలో కుడికాలి మడమ ఉండేలా నిద్రించాలి.

**పొద్దుట లేచినతర్వాతి దుఆ :** اَلْحَمْدُ لِلّٰهِ الَّذِىْٓ اَحْيَانَا بَعْدَ اَمَاتَنَا وَ اِلَيْهِ النُّشُوْر

అల్‌హందులిల్లాహిల్లజీ అహ్‌యానా బాద అమాతినా వ ఇలైహిల్‌నుషూర్ చదవాలి.

**టాయిలెట్లో కూర్చునే పద్ధతి :** దుఆ చదివి టాయిలెట్లో ప్రవేశించాలి. దక్షిణంవైపు ముఖం ఉంచి ఎడమకాలిపై బరువు వేసి కూర్చోవాలి. ఎడమమోకాలిపై ఎడమచేయి ఉంచాలి. కుడిమోచేయి కుడిమోకాలిపై ఆన్చి కుడిచేతిని తలపై ఉంచి పట్టుకోవాలి. ఆ విదంగా తల వంగకుండా, చూపు అపరిశుభ్రంపై, మర్మాంగాలపై పడకుండా ఉండాలి. లేకుంటే షైతాను చేష్టలకు అవకాశం ఉంటుంది.

**టాయిలెట్లో ప్రవేశించే దుఆ :** అవూజుబిల్లాహి మినల్ కుబుసి వల్ ఖబాయిస్

اَعُوْذُ بِاللّٰهِ مِنَ الْخُبُثِ وَ الْخَبَائِث

**టాయిలెట్ నుంచి వచ్చే దుఆ :** అల్‌హందులిల్లాహిల్లజీ అజ్‌హబఅనిల్‌అజ వ ఆఫానీ

اَلْحَمْدُ لِلّٰهِ الَّذِىْ اَذْهَبَ عَنِّ الْاَذٰى وَ عَافَانِىْ

స్తోత్రాలన్నీ దేవునికే. దేవుడు నా నుంచి కష్టం కలిగించేదానిని తొలగించి సుఖాన్నిచ్చాడు.

# ఫిత్రా, జకాత్, కుర్బానీ, అకీఖా పద్ధతులు

## ఫిత్రా

**ఫిత్రా :** నిర్ధారిత మొత్తం సంపద ఉన్న వారికి సదఖాయె ఫిత్ర్ చెల్లించడం తప్పనిసరి. తన ఫిత్రా, తన కుటుం బసభ్యు లందరి ఫిత్రా చెల్లించాలి. చిన్న పిల్లలకు కూడా ఫిత్రా చెల్లిం చాలి.

**ఫిత్రా ఎవరు చెల్లిం చాలి :** తన అవ సరాల కన్నా అధిక మొత్తం ఉన్నవ్యక్తి, రుణభారం లేని వ్యక్తి ఫిత్రా చెల్లిం చాలి.

**ఫిత్రా పరిమాణం :** ప్రతి వ్యక్తికి గోధుమలు ఒక కిలో 750 గ్రాములు

**జొన్నలు :** ప్రతి వ్యక్తి 3 కిలోలు

**ఖర్జూరాలు :** ప్రతి వ్యక్తి 3 కిలోలు

**మునక్కా :** ప్రతి వ్యక్తికి 3 కిలోలు ఏదైనా ఈ లెక్క ప్రకారం లేదా అంత మొత్తం రొఖ్ఖంకాని చెల్లించాలి. ఈ విలువ కలిగిన ధాన్యం లేదా ఆభరణాలు లేదా దుస్తులు కూడా ఇవ్వవచ్చు. ఒక ఫిత్రాను అనేకమందికి లేదా అనేక ఫిత్రాలను ఒకరికి కూడా ఇవ్వవచ్చు.

**ఈద్ కానుక :** ఫిత్రా మొత్తాన్ని ఈదీగా ఈద్ కానుక గా కూడా ఇవ్వవచ్చు.

**ఫిత్రా పంపిణీ :**

జకాత్ తీసుకునే అర్హత కలిగిన వారం దరికి పిత్రా ఇవ్వవచ్చు. జకాత్ ఇవ్వకూడని వారికి ఫిత్రా కూడా ఇవ్వరాదు. ఫిత్రాను ఈద్ నమాజుకు ముందే చెల్లించాలి. ఫిత్రా చెల్లించక పోతే అది రుణంగా ఉంటుంది.

## జకాత్

**జకాత్ :** నిర్ధారిత మొత్తం సంపద ఉన్న ముస్లిము లందరూ తప్పని సరిగా జకాత్ చెల్లించాలి.

**జకాత్ చెల్లించవలసిన వారు :** 87 గ్రాముల 500 మి.గ్రా. బంగారం లేదా 61 గ్రాముల 600 మి.గ్రా వెండి లేదా దానికి సమానమైన రొఖ్ఖం తన వద్ద ఒక సంవత్సరం కన్నా అధికకాలం ఉన్నట్లయితే ఆ వ్యక్తి రుణభారం లేనివాడయితే జకాత్ చెల్లించాలి.

**బంగారం, వెండి జకాత్ :** 2.5 శాతం జకాత్‌గా చెల్లిం చాలి.

**జకాత్ ఎవరికి ఇవ్వాలి :** బీదలు, బిచ్చమెత్తేవారు, రుణ భారం కలిగినవారు, ప్రయాణీ కులకు దేవుని కోసం ఈ జకాత్ చెల్లించాలి.

**ప్రాధాన్యత కలిగిన వారు :** బీదరికంలో ఉన్న సోదరులు, అక్కాచెల్లెళ్ళు, వారి సంతానం 2. బీదరికంలో ఉన్న పినతండ్రులు, పినతల్లులు, వారి సంతానం 3. బీదరికంలో ఉన్న తల్లితరఫు వారు అంటే మేన మామ, మేనత్తలు వారి సంతానం 4. పొరుగువారు 5. తన వృత్తి వారు 6. తన పట్టణం ప్రజలు 7. వికలాంగులు 8. ధార్మిక విద్యార్థులు, ధర్మప్రచా రకులు.. వీరికి ప్రాధాన్యం ఇవ్వాలి. ఇతర పట్టణాలకు జకాత్ పంపించడం అంత మంచిది కాదు.

**జకాత్ నిషేధించబడినవారు :** జకాత్ మొత్తాన్ని తన తల్లి దండ్రులకు, తాతయ్య, నానమ్మ, అమ్మమ్మ లకు, తన మనుమలు మనుమరాండ్రకు, భార్యకు, బర్తకు, సంపన్నులకు, అవిశ్వాసులకు, సాదాతులకు ఇవ్వరాదు. సాదాతు లకు స్వచ్ఛమైన సొమ్ము ఇవ్వవచ్చు.

**ఈద్ కానుక :** జకాత్, ఫిత్రాలను ఈద్ కానుకగా ఇవ్వ వచ్చు.

**సంకల్పం :** ఓ అల్లాహ్ నేను నా సంపదపై జకాత్ చెల్లి స్తున్నాను. ఇది స్వీకరించు అన్న సంకల్పం ఉండాలి.

## కుర్బానీ

**కుర్బానీ :** నిర్ధారిత మొత్తం ఉన్న ప్రతి ముస్లిం కుర్బానీ ఇవ్వాలి.

**కుర్బానీ ఇవ్వవలసిన వారు :** జకాత్, సదకాయె ఫిత్రాల మాదిరిగా కుర్బానీ విషయంలో ఒక సంవత్సర కాలం గడువడం అన్న షరతు లేదు.

**కుర్బానీ ఎప్పుడు ఇవ్వాలి :** జిల్‌హజ్జా మాసం 10వ తేదీన ఈద్ నమాజు తర్వాత కుత్బా ఐన తర్వాతి నుంచి జిల్‌హజ్జా 12వ తేదీ సాయంత్రం వరకు కుర్బానీ ఇవ్వవచ్చు. కుర్బానీ పగటిపూట మాత్రమే ఇవ్వాలి. రాత్రులు కుర్బానీ ఇవ్వడం మక్రూ.

**కుర్బానీ జంతువులు :** సంవత్సరం వయసు ఉన్న గొర్రె, మేకలను ఒక వ్యక్తి కోసం కుర్బానీ ఇవ్వవచ్చు. ఆవు, బర్రె అయితే రెండు సంవత్సరాల వయసు ఉన్న పశువును ఏడుగురు కలిసి ఇవ్వవచ్చు. కుర్బానీ జంతువు ఆరోగ్యంగా, ఎలాంటి లోపం లేనిదై ఉండాలి.

**కుర్బానీ మాంసం :** కుర్బానీ మాంసాన్ని మూడు భాగాలుగా చేయాలి. ఒక భాగాన్ని స్వంతం కోసం ఉంచుకోవచ్చు. ఒక భాగాన్ని పొరుగు వారికి, బంధువులకు పంచిపెట్టాలి. మూడవ భాగాన్ని బీదలకు పంచిపెట్టాలి. కుర్బానీ మాంసాన్ని ముస్లిమేతరులకు ఇవ్వడంలో ఎలాంటి తప్పు లేదు.

**కుర్బానీ సంకల్పం : ఆల్లాహుమ్మ హాజిహిల్ అజ్‌హియ్యాతు తఖబ్బల్ మిన్నీ కమా తఖబ్బల్‌తు మిన్ ఇబ్రా హీమ ఖలీక వ మిన్ సయ్యదినా ముహమ్మదిన్ నబియ్యిక వ హబీ బిక అలైహిముస్సలాతు వస్స లాము.** ఆ తర్వాత **బిస్మిల్లాహి అల్లాహు అక్బర్** అని చెప్పి జుబహ్ చేయాలి.

**కుర్బానీ చర్మం :** కుర్బానీ చర్మాన్ని లేదా దాని విలువను అర్హులైన వారికి ఇవ్వాలి. బీద విద్యార్థులకు ఇవ్వడం పుణ్య ప్రదం.

## అకీఖా

**అకీకా** శిశువు జన్మించిన తర్వాత 7వ, 14వ లేదా 21వ రోజున సాధ్యమైతే అకీకా చేయడం అభిలషణీయం. 7వ రోజున చేయడం మంచిది. శిశువు శుక్రవారం జన్మించి నట్లయితే అకీకా గురువారం నాడు చేయాలి.

**అకీకా జంతువులు :** కుమారుడైతే రెండు గొర్రెలు, కుమార్తె అయితే ఒక గొర్రె జుబహ్ చేయాలి. ఆవు, బర్రె లను కూడా ఇవ్వవచ్చు. ఈ పశువులు ఏడు గొర్రెలకు సమానం

**అకీకా జంతువు వయసు :** జంతువు ఆరోగ్యంగా లోపం లేనిదై ఉండాలి. గొర్రె అయితే ఏడాది వయసు కలిగినది, ఆవు అయితే రెండేళ్ల వయసు కలిగినదై ఉండాలి.

**సంకల్పం : అల్లాహుమ్మ హాజిహీ అకీకతు ఇబ్నె (పేరు) దమ్మా బి దమ్మిహి వ లమ్‌హమా బి లమ్మిహీ వ అజ్మహా బి అజ్మిహీ వ జిదుహా బి జిదిహీ షారుహా బి షారిహీ, అల్లాహుమ్మ తఖబ్బల్ హా మిన్నీ వజ్‌అల్‌హా ఫిదాఅన్ లి ఇబ్ని మిన్నారి** ఆ తర్వాత **బిస్మిల్లా అల్లాహు అక్బర్** అంటూ జుబహ్ చేయాలి.

**తలవెంట్రుకలు తీయడం :** జంతువును జుబహ్ చేసిన తర్వాత శిశువు తలవెంట్రుకలు తీయించాలి. ఆ వెంట్రుకలను బంగారం లేదా వెండితో తూచి వెంట్రుకలను నేలలో పాతి పెట్టాలి. బంగారం లేదా వెండిని అకీకా జంతువు చర్మాన్ని బీదలకు ఇవ్వాలి.

**అకీకా మాంసం :** కుర్బానీ మాదిరిగానే అకీకాలోను మాంసాన్ని మూడుభాగాలుగా చేసి వాడాలి.




# పరదా ఎందుకు?
## స్త్రీ మానమర్యాదలకు పరిరక్షణ

**యావత్తు మానవాళి సంక్షేమానికి ఉద్దేశించిన దేవుని ఆదేశాలు,**

మానవప్రవృత్తికి అనుగుణమైన దేవుని ఆదేశాలు, మనిషి పుట్టుక నుంచి మరణం వరకు సమస్త జీవనరంగాల్లో మార్గదర్శనం ఇచ్చే దేవుని ఆదేశాలు స్పష్టంగా ఉన్నాయి. పరదా అందులో ఒకటి, దేవుని ప్రత్యేక ఆదేశాల్లో ఇది ఒకటి.

| పరదా ఎందుకు పాటించాలంటే | పరదా పాటించకపోతే నష్టాలు |
|---|---|
| 1. సౌందర్యాన్ని కాపాడడానికి | 1. వయసుకు ముందే యుక్తవయస్సులవ్వడం |
| 2. మానమర్యాదల పరిరక్షణకు | 2. యవ్వనం త్వరగా అంతరించడం |
| 3. మనసు, చూపులు స్వచ్ఛంగా ఉండడానికి | 3. నిస్సిగ్గు, నిర్లజ్జలకు జన్మనివ్వడం |
| 4. సిగ్గులజ్జలను కాపాడ్డానికి | 4. మార్గతప్పడం, అపహరణలకు గురికావడం |
| 5. కుటుంబంలో శాంతిశ్రేయాలకు | 5. సందేహాలకు తావునివ్వడం |
| 6. మంచిసమాజాన్ని బలపరచడానికి | 6. మోసాలకు గురికావడం |
| 7. లజ్జను కాపాడ్డానికి | 7. వైవాహిక సంబంధం బలహీనం కావడం |
| 8. భవిష్యత్ తరాల పరిరక్షణకు | 8. కుటుంబంలో విభేదాలు |
| 9. దేవుని ఆమోదం పొందడానికి | 9. దేవుని ఆగ్రహం |

**పరదా :** స్త్రీ శరీరమంతా కప్పి ఉండాలి

**మేకప్ :** పరాయి వారి కోసం మేకప్‌తో తన అందాన్ని పెంచుకోనే స్త్రీ లజ్జలేనిది.

**మినహాయింపులు :** ముఖం, చేతులు వగైరా అవసరమైతే అచ్ఛాదన లేకుండా ఉండవచ్చు. అంటే వైద్య చికిత్స సందర్భంగా లేదా వివాహం జరుగుతున్నప్పుడు, అయితే తన అందాన్ని ప్రదర్శించే సంకల్పం అందులో ఉండరాదు. కేవలం అవసరం మేరకే అనాచ్ఛాదితంగా ఈ భాగాలు ఉండవచ్చు.

**దృష్టి :** మొదటిసారి అకస్మాత్తుగా చూపు పడడం అన్నది క్షమార్హమైనది. రెండవ చూపు అన్నది అవాంఛనీయమైనది. ఉద్దేశ్యపూర్వకంగా చూసే మూడవ చూపు హరామ్

**జాగ్రత్త :** చెడుచూపు వ్యభిచారానికి తొలిమెట్టు

**మంచిమాట :** మనసు, చూపులు ముస్లిములు కానట్లయితే ఇక ముస్లిముగా ఏదీ లేదు. (ఇక్బాల్)

**శుభవార్త :** అనేక అభివృద్ధి చెందిన దేశాలలో అసంఖ్యాక ఫ్యాషనబుల్ స్త్రీలు ఇస్లాంలోని శాంతి శ్రేయాలను గురించి తెలుసుకున్న తర్వాత ఇస్లాం స్వీకరిస్తున్నారు.

**హెచ్చరిక :** మంచి లేదా చెడుచూపులపై మీకు అదుపు ఉంది.

**సలహా :** మీ మనసునడిగి తెలుసుకోండి. మీ మనసుకు కష్టం కలిగించేది ఏదయినా దాన్ని వదిలేయండి (అబూ దావూద్, తిర్మిజి)

# తలపై టోపీ లేకుండా నమాజు చదువడం

## ఇది సంప్రదాయానికి విరుద్ధం

నమాజు తలపై కప్పుకోకుండా చదువడం అన్నది ప్రవక్త ముహమ్మద్ (స) సంద్రాయానికి విరుద్ధం, ప్రవక్త సహచరుల సంప్ర దాయానికి విరుద్ధం. ధర్మవేత్తలు, పుణ్యపురుషుల సంప్రదాయానికి విరుద్ధం.

### దైవప్రవక్త (స) ఆదేశం

అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) ఉటంకం, ఎవరు ఏ సమూహాన్ని అనుసరిస్తారో వారు ఆ సమూహం అనుచరులుగా భావించబడుతారు. తీర్పుదినాన వారిలో ఒకరిగా లేపబడతారు.

(ముస్నద్ అహ్మద్, అబూదావూద్)

### అమామా (తలపాగ)

టోపీపై తలపాగా కట్టాలి (తిబ్రాని, హాకిమ్, బైహాకీ, నిసాయి, ముస్లిమ్, మిష్కాత్) చిన్న తలపాగా గుడ్డ ఏడుచేతుల పొడుగు ఉండాలి. పెద్ద తలపాగా 12 చేతుల పొడుగు ఉండాలి. (మిరాతుల్ మిష్కాత్, మనవి, ముల్లా అలీ కారి)

తలపాగా కట్టి నమాజు చదివిన వారికి పదివేల పుణ్యాలకు సమానమైన ఫలితం లభిస్తుంది. తలపాగా కట్టి చదివిన రెండు రకతుల నమాజు తలపాగా లేకుండా చదివిన డెబ్బయి రకతుల నమాజు కన్నా ఉత్తమమైనది.

(జామియా సగీర్, ముస్నదుల్ పిర్దౌస్ వగైరా)

## అవాంఛ నీయం

ఆమోదించబడని చేష్ట నిర్లక్ష్యంగా, బద్ధకంగా తలపై కప్పుకోకుండా నమాజు చదువడం అవాంఛ నీయం. అయితే నమాజు సంద ర్భంగా తలపై టోపీ లేదా టర్బన్ క్రింద పడిపోతే దానిని మరలా తీసుకుని తలపై పెట్టుకోవడం ఉత్తమం. తలపై కప్పుకోకుండా నమాజు చదువడం అన్నది దేవుని కి, దైవప్రవక్తకు అయిష్టమైన చేష్ట.

## అవిశ్వాసం కూడా కావచ్చు

తలపై కప్పుకోకుండా నమాజు చదువడం అన్నది అంటే నమాజును ఒక రొటీన్‌గా భావించి ఒక మామూలు పని చేసినట్లు నిర్లక్ష్యంగా చేయడం కుఫ్ర్ కావచ్చు.

**దైవాదేశం :** చెప్పండి, మీరు దేవుని ప్రేమిస్తే నన్ను అనుసరిం చండి (ఆలి ఇమ్రాన్ 31)

నిస్సందేహంగా, మీకు రసూలుల్లాహ్ లో ఉత్తమమైన ఉదాహరణ ఉంది. (అహ్‌జాబ్ 21)

దైవప్రవక్త మీకు ఇచ్చినదాన్ని స్వీక రించండి, ఆయన నివారించిన దానికి దూరంగా ఉండండి. (హష్ర్ 7)

## ఫత్వా :

### జామియా నిజామియా దేవ్‌బంద్ అహ్లెహదీస్, గైర్ ముఖల్లద్ ఆలీమ్

1. జామియా నిజామియా, హైదరాబాద్ దక్కన్, నిషాన్ 572, వాల్యూమ్ 43, తేదీ 17 జిమాదుల్ అవ్వల్ 1412, హిజ్రీ, 5 నవంబర్ 1991.
2. ఫతావా ఇమాదియా 365, వాల్యూమ్ 1పేజి 442, దారుల్ ముక్తార్, వాల్యూమ్ 1పేజి 670, తేదీ 11 షవ్వాల 333 హిజ్రీ, దార్ ముక్తార్ వాల్యూం1, పేజి 34
3. నిసాబ్ ఎహ్లే ఖిద్‌మత్, షేరియా, చాప్టర్ మక్రూహాతె నమాజ్ వగైరా
4. ఫతావా సానియా, వాల్యూం 1 పేజి 525, గైర్ ముఖల్లిద్ ఆలిమ్‌ఔ
5. ఫతావా తాతార్ ఖానియా, వాల్యూం 1 పేజి 563
6. ఫతావా అహ్లె హదీస్, వాల్యూం 4 పేజి 291 ఫతాల్ కదీర్ పేజి 266 షమాయిలె తిర్మిజి పేజి 36




తలపై టోపి ధరించి నమాజు చదవండి. అల్లాహ్, రసూల్ ప్రసన్నత పొందండి. గెడ్డానికి సంబంధించిన నియమాలు

# గెడ్డం గురించిన ఉత్తర్వులు

**గెడ్డం పెంచడం సున్నతె ముఅక్కిదా. కొందరు ధర్మవేత్తల ప్రకారం ఇది వాజిబ్.**

(అల్ మిన్‌హిమల్ అజాబ్ అల్ మవ్‌రూద్, పేజి 186)

## దైవప్రవక్త (స) ఆదేశం

గెడ్డాన్ని పెంచండి, మీసం ట్రిమ్ చేయండి

(మిష్కాతుల్ మిసాబిహ్, వాల్యూం 2 4200, బుఖారి, ముస్లిమ్ 4260, తిర్మిజి)

**మీసం :** దైవప్రవక్త (స) వివిధ సందర్భాల్లో చెప్పిన ఐదు పదాలు ఇవి : కట్ చేయడం, ట్రిమ్ చేయడం, చిన్నది చేయడం, బాగా చిన్నది చేయడం, తగ్గించడం. (మిష్కాతుల్ మిసాబిహ్, ముస్లిమ్, బుఖారి)

**తలరంగు :** ప్రవక్త (స) ఆయన సహచరులు ఎరుపు, పసుపు రంగులు వాడేవారు. నల్లరంగు వాడకాన్ని నివారించారు

(మిష్కాత్, బుఖారి)

**మసలా :** యుద్ధంలో శత్రువులకు భీతి కలిగించడానికి ముస్లిం సైనికులు నల్లరంగు తలకు వాడే అనుమతి ఉంది గెడ్డం తీసేయడం హరామ్ : గెడ్డం తీసేసిన వ్యక్తిని అల్లాహ్ ఇష్టపడడు. (అలిఇమ్రాన్ 31-32, అహ్‌జాబ్ 21, హషర్ 7 ఆయతుల భావం)

**రిఫరెన్సులు :** కితాబుల్ ఉమామ్, ఇమామ్ షపాయి, మాలాబాద్ము, పేజి 130, ఖాజీ సనావుల్లా పానిపట్, హోసియా నిసాయి, పేజి 7, ఫైజుల్ బారి4, పేజి 380, బాజిల్ మజ్‌హూద్ ఫీ షరా అబూ దావూద్, వాల్యూమ్ 1, పేజి 33, అలాయి దార్ ముఖ్తార్ 5, పేజి 359, అల్‌మిహ్నల్ 1, పేజి 186, బాదర్‌ఉన్నవాదీర్, పేజి 443, ఫిఖ్ హనఫీ, సాఫాయి, మలకి, హంబలీ)

**తెల్లవెంట్రుకలు :** తెల్ల వెంట్రుకలను పీకరాదు. వయసుపైన పడినవారి వయసు నిజానికి స్వర్గప్రకాశం అవుతుంది.

(మిష్కాతుల్ మిసాబిహ్, అబూదావూద్, తిర్మిజి, నిసాయి).

**శాపం నుంచి రక్షణపొందండి :** స్త్రీల్లా వస్త్రాలు ధరించి ఫ్యాషన్ చేసే పురుషులు, పురుషుల్లా వస్త్రాలు ధరించే స్త్రీలపై దేవుని శాపం ఉందని ప్రవక్త (స) అన్నారు.

(మిష్కాతుల్ మసాబిహ్, బుఖారి, ముస్లిమ్, అబూదావూద్)

## ఆలోచించండి

నలుగురు ఖలీఫాలు, ప్రవక్త (స) అనుచరులు అందరూ (రజి), ప్రవక్త సహచరుల తర్వాతి తరానికి చెందినవారు, ధర్మవేత్తలు అందరూ ఇహపర లోకాల్లో సాఫల్యాన్ని సాధించు కున్న వారు తమకు ప్రవక్త (స) పట్ల ఉన్న ప్రేమాభిమానాల వల్ల ప్రవక్త (స) ఆచరణలన్నింటిని తూ.చ.తప్పక పాటించేవారు. కాని నేడు మనం గెడ్డం గీసుకుని, ప్రవక్త (స) సంప్రదాయాన్ని కాదంటూ కూడా ప్రవక్త (స) సముదాయానికి చెందినవారిగా చెప్పుకుంటున్నాము. గెడ్డం గీసుకునే వారి పట్ల దేవుడు, దైవప్రవక్త(స) ఇష్టం కలిగి ఉండరన్నది గ్రహించండి. వారిపై రాత్రింబవలు దైవశాపం ఉంటుంది. వారు పశ్చాత్తాపపడి గెడ్డం పెంచడానికి పూనుకోన్నంత వరకు.

(మిష్కాతుల్ మసాబిహ్ 2, 4209, బుఖారి షరీఫ్, అబూదావూద్)

# వధువరుల ఎంపికలో ఇస్లామీయ పద్ధతి

| వధువు ఎంపిక | | వరుని ఎంపిక |
|---|---|---|
| వధువు కలిమాయె తయ్యిబా పట విశ్వాసం కలిగి ఉండాలి. ఇమానె ముజమ్మిల్, ఇమానె ముఫస్సిల్ లక్షణాలు కలిగి ఉండాలి. లజ్జ కలిగి, పరదా పాటించే అమ్మాయి గా ఉండాలి. | ధార్మికత | కలిమతయ్యిబా పట్ల విశ్వాసం కలిగినవాడై, ఇమానె ముజమ్మిల్, ఇమానె ముఫస్సిల్ లక్షణాలు కలిగి ఉండాలి. |
| ఇస్లామీయ విధులు తెలిసి ఉండాలి. వాటిని ఆచరించాలి. మంచి పనులు చేసేదిగా ఉండాలి. మంచి స్త్రీ ఈ ప్రపంచంలో గొప్ప సంపద | ఇస్లామీయ విధులు | ఇస్లామీయ విధులు తెలిసినవాడై, వాటిని ఆచరించే వాడై ఉండాలి. నిషేధాలకు దూరంగా ఉండాలి. మంచి స్నేహితులు కలిగినవాడై ఉండాలి. |
| భౌతికంగా మానసికంగా ఆరోగ్యం కలిగి ఉండాలి. శారీరక పరిశుభ్రత, దుస్తుల పరిశుభ్రత, ఇంటి పరిశుభ్రత పాటించాలి. | ఆరోగ్యం | యుక్తవయస్కుడై, కష్టించేస్వభావం కలిగినవాడై శారీరకంగా, మానసికంగా ఆరోగ్యవంతుడై ఉండాలి. |
| ఆమె వంశం, కుటుంబం పరిస్థితులు చూడాలి. | వంశం | వంశం ఎలాంటిదో, కుటుంబం ఎలాంటిదో చూడాలి. |

**విద్యాజ్ఞానాలు**

మౌలిక విద్యార్జన, ఇస్లామీయ విద్యార్జన కలిగి ఉండాలి. ఆ విధంగా తన పిల్లలకు బోధించ గలిగి ఉండాలి. ఇంటిపనులు చేయ గలిగి ఉండాలి.

**సేవాభావం**

తల్లిదండ్రులు, కుటుంబ సభ్యులకు సేవచేసే అమ్మాయిగా ఉండాలి. పెద్దల పట్ల విధేయత, పిన్నల పట్ల ప్రేమ కలిగి మంచి అమ్మాయిగా పేరుపడి ఉండాలి.

**ఆదాయం**

తన కుటుంబాన్ని పోషించగలిగిన ఆదాయం కలిగి ఉండాలి

## వధువరుల జోడి

వయస్సు, రంగు, వ్యక్తిత్వం, ఎత్తు వగైరా విషయాలను కూడా దృష్టిలో ఉంచుకోవాలి. విద్యాజ్ఞానాల విషయంలో వధువు కన్నా వరుడు పైచేయిగా ఉండాలి. సంపద, హోదాగౌరవాలు, వంశం, ఆర్థిక పరిస్థితి వగైరాలు పరిశీలించడం మంచిదే. వధువును బీద కుటుంబం నుంచి ఎంచుకోండి, అమ్మాయిని ఆర్థికంగా ఉన్నత కుటుంబంలో ఇవ్వండి. స్త్రీ నుంచి ఎన్నడూ కట్నాలు ఆశించవద్దు. ప్రవక్త (స) హజ్రత్‌అలీ (రజి) నుంచి సొమ్ము తీసుకుని దుస్తులు, ఆభరణాలు, ఇతర ఇంటి సామాగ్రి కొని తన కుమార్తెకు ఇచ్చారు. హజ్రత్ సయ్యదా ఫాతిమా (రజి) పెళ్ళిలో ఇదే జహెజ్

రిఫరెన్సు : ఇస్లామీయ చరిత్ర, హదీసులు

**గమనిక :** పెళ్ళికి ముందు మౌలానా గులామ్ నబీ షా సంకలనం చేసినవధువరుల ఎంపిక చార్టును వారికి ఇవ్వడం మంచిది.

# వరకట్నం ఇస్లామేతర సంప్రదాయం

ముస్లిమేతర సమాజానికి చెందిన వరకట్నం, కంగన్, సెహ్రా, టపాసులు, వగైరాలు ముస్లిం సంప్రదాయాలు కావు. ఈ సంప్రదాయాలు ముస్లిం సమాజంలోను చొరబడ్డాయి. వరకట్న దురాచారం కింద వేలాది ముస్లిం అమ్మాయిలు కూడా నలిగిపోతున్నారు.

## ఇస్లామీయ దహేజ్

వధువుకు సంబంధించిన దహేజ్ వరుడు ఇచ్చిన సొమ్ముతో కొనాలి (ప్రవక్త(స) సంప్రదాయం) ప్రవక్త (స) 280 దిర్హములు హజ్రత్ అలీ నుంచి తీసుకుని దహేజ్ కొనుగోలు చేసారు. ఆ విధంగా కొన్ని దుస్తులు, ఆభరణాలు, ఇంటి సామాన్లు వగైరా దహేజ్‌గా ఇచ్చారు.

## పెళ్ళి, వలీమా

మస్జిదె నబవీలో రమజాను మాసం, హిజ్రీశకం 2లో ప్రవక్త (స) కుమార్తె వివాహం చాలా సింపుల్‌గా జరిగి పోయింది. ప్రవక్త (స) స్వయంగా వివాహప్రసంగం చేసి ప్రార్థించారు. ఖర్జూరాలు, ద్రాక్ష, పటికబెల్లం వగైరాలను వరునిపై విసిరారు. వాటిని ప్రవక్త (స) సహచరులు తీసుకున్నారు.

## వలీమా

హజ్రత్ అలీ వలీమా ఏర్పాటు చేసారు. కొన్ని ఖర్జూరాలు విందులో వడ్డించడం జరిగింది. కాని ప్రస్తుత కాలంలో వరుని తరఫువారు వధువు తల్లిదండ్రులను కట్నకానుకల పేరిట దోచుకుంటున్నారు.

ప్రవక్త (స) జీవితచరిత్రను, ఆయన సంప్రదాయాలను అనుసరించండి. మీ సమస్యలను పరిష్కరించు కోండి. ప్రవక్త (స) గులామ్, గులామ్ నబీషా మాటలు వినండి. ముళ్ళకు పూలకు మధ్య తేడా గుర్తించండి.

## విశ్వాసులు

విశ్వాసులు నీల్ నది ప్రాంతంలో ప్రవేశించినప్పుడు అక్కడ ముస్లిమేతరుల్లో ఉన్న దురాచారాన్ని, అంటే ఒక కన్యను బలి ఇచ్చే దురాచారాన్ని నిలిపివేసారు. ముస్లిములు అంటరానితనాన్ని రూపుమాపారు. మానవసమానత్వాన్ని స్థాపించారు. వితంతు పునర్వివాహాలను ప్రోత్సహించారు. (ఇస్లాం చరిత్ర). దురాచారాలను అడ్డుకుని మంచి సమాజ నిర్మాణానికి కృషిచేసిన ముస్లిములు నేడు వరకట్న దురాచారానికి గురికావడం శోచనీయం. కాబట్టి ఈ దురాచారాలను తక్షణం వదులుకోవాలి.

## హెచ్చరిక :

చివరి హజ్ ప్రసంగంలో అరఫాత్ మైదానంలో ప్రవక్త (స) గట్టిగా చేసిన హెచ్చరికను గుర్తుంచుకోవాలి అదేమంటే "అజ్ఞానకాలం నాటి దురాచారాలన్నీ నేను నా కాలికింద అణిచేసాను. నేను ఖుర్ఆన్, హదీసులను, నా సంప్రదాయాలను మీకు వదిలి వెడుతున్నాను. వాటిని గట్టిగా పట్టుకోండి. మీరెన్నటికి మార్గం తప్పరు. (బుఖారి, ముస్లిం)

**ముస్లిం సోదరులారా**

అల్లాహ్ కోసం, దైవప్రవక్త (స) కోసం, దురాచారాలను ఆపండి. సమాజం మరింత పతనం కాకుండా కాపాడండి. ప్రవక్త (స) సంప్రదాయాలను అనుసరించండి.

**సంకలనం**

గులామ్ నబీ షా నక్ష్‌బందీ, ఇం.నెం.17-2-1209/13, యాకూత్‌పుర, హైదరాబాద్ 23, ఫోన్ : 9391349104.
ఇస్లామిక్ సెంటర్ ఫర్ దావా, జుబిలీ హైస్కూలు వెనుక, విజయనగర్ కాలనీ, హైదరాబాద్ 57.

# నిజమైన ముస్లిమ్ భర్త, భార్య, పిల్లలు

## భర్త ధార్మికస్వభావం

1. ఇమాన్‌ను రక్షించుకోవాలి. వంశాభివృద్ధికి నికాహ్ చేసుకోవాలి.
2. భార్యను ఎంచుకునేటప్పుడు అందాని కన్నా ధార్మికతకు ప్రాధాన్యం ఇవ్వాలి.
3. తన విశ్వాసానికి, ఈ ప్రపంచంలో లభించిన ఉత్తమ కానుకగా భార్యను చూడాలి.
4. భార్య పోషణతన బాధ్యతగా భావించాలి.
5. కుమార్తెలను ప్రేమగా పెంచి స్వర్గానికి అర్హత పొందాలి.
6. రుతుస్రావకాలంలో సంభోగం, అక్రమ సంభోగం, గుదసంభోగాలను హరాంగా భావించాలి.

## భార్యను సంతోషపెట్టడం

1. తన భార్యను దయాస్వభావం కలిగిన, విశ్వాసం కలిగిన తన ఇంటి రాణిగా భావించాలి.
2. భార్యకు సన్నిహితంగా ఉండి ఇంటిని శాంతిధామంగా మార్చాలి.
3. తనకు సాధ్యపడిన మేరకు భార్య కోరికలను తీర్చాలి.
4. తన భార్యను పోషించడం అవసరాలు తీర్చడం పుణ్యకార్యంగా చేయాలి.
5. ఇంటిపనుల్లో భార్యకు సంతోషంగా సహకరించాలి.
6. తన భార్యకు మానసికంగా హింసించడం లేదా మనస్సు బాధపడేలా ప్రవర్తించడానికి దూరంగా ఉండాలి.
7. భార్యకు సంబంధించిన సహజమైన మొండితనాన్ని భరించాలి.
8. తన భార్య అన్నదమ్ములను, అక్కచెల్లెళ్ళను, తల్లిదండ్రులను గౌరవించాలి.
9. తన భార్యను తన తల్లిదండ్రులు లేదా సోదరసోదరిలు సరిగా చూడకపోతే ఆమెను వేరుగా ఉంచడం భర్త బాధ్యత.

## భర్త లక్షణాలు

1. చూపు, మాటకు సంబంధించి తన్ను తాను కాపాడుకోవాలి.
2. స్త్రీల మాదిరి దుస్తులు లేదా వ్యవహారశైలికి దూరంగా ఉండాలి.
3. ఇతర స్త్రీలకు దూరంగా ఉండాలి. వారిని తన తల్లి, చెల్లి,కుమార్తెలుగా భావించాలి.
4. తన భార్యకు రక్షకునిగా ఉండాలి. ఆమెకు సౌలభ్యాలు కలుగజేసేవానిగా ఉండాలి.
5. తన భార్యకు సంబంధించిన రహస్యాలను ఇతర పురుషుల ముందు చెప్పరాదు.
6. తన భార్య, పిల్లల ఆరోగ్యం, విద్యభ్యాసాల బాధ్యత తీసుకోవాలి.

## భార్య ధార్మికత

1. పెళ్ళయిన తర్వాత భార్య భర్తకు విధేయంగా ఉండాలి.
2. భర్తకు ధార్మికవిధుల్లో, ప్రాపంచిక విధుల్లో సహకరించాలి.
3. తన భర్తను దేవుని కానుకగా భావించాలి. ఆయన్ను గౌరవించాలి.
4. భర్త పట్ల విధేయంగా ఉండడం తన బాధ్యత గా భావించాలి.
5. భర్తను సంతోషపెట్టాలి. తన పిల్లల పట్ల తన విధులను నిర్వర్తించి స్వర్గానికి అర్హత పొందాలి.
6. సొడోమీ, రుతుస్రావకాలంలో సంభోగానికి ఒప్పుకోరాదు.

### భర్తను సంతోషపెట్టడం

1. తన భర్తను రక్షకునిగా భావించాలి. తన పట్ల అధికారం ఉన్నవాడిగా భావించాలి.
2. తన అవసరాల విషయంలో భర్తను ఆజ్ఞాపించరాదు.
3. తన భర్తను తలకుమించిన కోరికలు కోరరాదు.

### తల్లిదండ్రులతో ఎలా వ్యవహరించాలి.

1. ధార్మికత కలిగిన సంతానం తల్లిదండ్రులకు ఒక వరం
2. అలాంటి సంతానం తల్లిదండ్రుల పట్ల గౌరవాన్ని కలిగి ఉంటుంది.
3. తల్లిదండ్రులను సేవిస్తారు
4. తల్లిదండ్రుల పట్ల విధేయత చూపడం అల్లాహ్ ఆదేశంగా భావిస్తారు.
5. తల్లిదండ్రుల ప్రసన్నతలోనే దేవుని ప్రసన్నత ఉందని తలపోస్తారు.

### విధేయత కలిగిన ముస్లిం సంతానానికి ఇహపరలోకాల్లో లభించే కానుకలు

1. విశ్వాసం పటిష్టంగా ఉంటుంది.
2. ఉపాధిలో సౌభాగ్యం ఉంటుంది.
3. ఈ ప్రపంచంలో గౌరవం లభిస్తుంది.
4. ప్రతిరోజు ఒక నఫీల్ జిహాద్ పుణ్యం లభిస్తుంది.
5. ఆరోగ్యకరమైన, దీర్ఘకాలిక జీవితం లభిస్తుంది.
6. ఒక మక్బూల్ హజ్‌కు సమానమైన రివార్డు లభిస్తుంది.
7. ఇమాన్‌తో మరణం ప్రాప్తమవుతుంది.
8. పరలోకంలో స్వర్గం లభిస్తుంది.

### అవిధేయత కలిగిన ముస్లిం సంతానం

1. పెద్దపాపాలు చేసినవాళ్ళవుతారు.
2. ముఖంపై వర్చస్సు ఉండదు. మనస్సులో తృప్తి ఉండదు.
3. ప్రపంచంలో శాపగ్రస్తులవుతారు.
4. ప్రపంచంలో అగౌరవానికి లోనవుతారు.
5. అల్లాహ్, దైవప్రవక్త (స) అప్రసన్నులవుతారు.
6. ఫర్జ్, నఫీల్ నమాజులేవీ స్వీకరించబడవు.
7. దుఆలు ఏవీ స్వీకరించబడవు.
8. మరణం కఠినంగా ఉంటుంది.
9. పరలోకంలో నరకభయం ఉంటుంది.

**రిఫరెన్సులు :**

అల్‌హక్ 51, లుక్మాన్ 15, బనీ ఇస్రాయీల్ 23, మాయిదా 27, మిష్కాత్ 2, 4668, 4669, 4682, 4685, 4701, ముస్లిమ్, అల్సానా, ఇబ్నె అబీ ఆసిమ్, బైహకీ, అబూ దావూద్, అహ్మద్, తిబ్రానీ, నిసాయీ, దార్మి, బుఖారి, వగైరా.




## మీ పతనాన్ని తప్పించుకోండి
## మిమ్మల్ని మీరు గౌరవించుకోండి
## మీ జీవితాన్ని తీర్చి దిద్దండి

## మీ పతనం నుంచి రక్షణకు

- అబద్ధాలు చెప్పడం మానండి లేనట్లయితే మీ ఉపాధి తగ్గిపోతుంది.
- దుర్భాషలు మానండి లేనట్లయితే అగౌరవం పాలవుతారు.
- దొంగతనాలు మానండి లేనట్లయితే చెడ్డవారిగా ముద్రపడతారు
- చాడీలు మానండి లేనట్లయితే మీ మంచిపనులు ఇతరుల ఖాతాలోకి వెళతాయి.
- ప్రదర్శనాబుద్ధి మానుకోండి లేనట్లయితే మీ మంచిపనులు పాపాలుగా మారవచ్చు
- అబద్ధపు ప్రమాణాలు చేయకండి లేనట్లయితే బీదరికం పాలవుతారు.
- హరాం తినడం, తాగడం మానండి లేనట్లయితే మీ ఈమాన్ పోతుంది.

## మీ తల్లిదండ్రుల పట్ల అవిధేయత మానండి

లేనట్లయితే
- మీ ఆయుష్షు తగ్గిపోతుంది.
- అన్ని విధాల సమస్యలు చుట్టుముడతాయి.
- నమాజ్, రోజా, జకాత్ తదితర పుణ్యకార్యాలు స్వీకరించబడవు.
- ఈమాన్‌తో మరణం కష్టమవుతుంది.

### ముస్లిములారా!

ప్రవక్త (స)కు బాధకలిగించవద్దు. ప్రతి సోమవారం, గురువారాల్లో ముస్లిముల ఆచరణలను ప్రవక్త (స) ముందు ఉంచడం జరుగుతుంది. మన చెడ్డపనులు చూసి ఆయన చాలా బాధపడతారు.

## మిమ్మల్ని మీరు గౌరవించుకోండి

మన హృదయాల్లో విశ్వాస సంపద ఉంది. అల్లాహ్, ప్రవక్త (స)ల పట్ల ప్రేమ ఉంది. దీన్ని జాగ్రత్తగా కాపాడుకోండి. ఈమాన్ ఉన్నవారే నిజమైన దేవుని స్నేహితులు. దైవప్రవక్త (స)కు స్నేహితులు. ఈ స్నేహాన్ని పటిష్టం చేసుకోండి

అల్లాహ్ తన స్నేహితులకు అనేక వరాలతో సత్కరిస్తాడు.

**గుర్తుంచుకోండి.**

**దేవుడిచ్చినది శాశ్వతం,**
**మనుష్యులు ఇచ్చేది తాత్కాలికం.**

### ప్రవక్త (స) సంతోషపడేలా చేయండి

ప్రతి సోమ, గురువారాల్లో ప్రవక్త (స) ముందు ముస్లిముల ఆచరణలు ఉంచబడతాయి. ఆయన మన మంచిపనులు చూసి సంతోషిస్తారు. మన కోసం ప్రార్థిస్తారు. ప్రవక్త (స) మీ పేరుతో ప్రార్థన చేసే సౌభాగ్యం మీరు కూడా పొందవచ్చు. ఆ విధంగా ఇహపరలోకాల్లో సాఫల్యం పొందవచ్చు. కాబట్టి మంచిపనులు చేయండి.

**మాకు తెలియదు కదా అని ఇక చెప్పకండి.**

### మీ జీవితాన్ని తీర్చిదిద్దుకోండి

- ఎప్పుడు సత్యం పలుకండి
- మంచి స్వభావం కలిగి ఉండండి. మిమ్మల్ని అందరూ గౌరవిస్తారు
- కేవలం హరాం సంపాదన ఉన్నప్పుడే దుఆలు స్వీకరించబడతాయి.
- తల్లిదండ్రులను సంతోషపెట్టడం ద్వారా ఆయుష్షు పెరుగుతుంది.
- మీ ఉపాధి పెరుగుతుంది.
- మంచి ఆరోగ్యం లభిస్తుంది.
- మీ ప్రార్థనలు స్వీకరించబడతాయి.
- గౌరవప్రదమైన జీవితం లభిస్తుంది. మరణం ఈమాన్‌తో ప్రాప్తమవుతుంది.
- పరలోకంలో స్వర్గం లభిస్తుంది.